# ఈనాటి సాంకేతిక నిపుణుల అత్యంత అధునాతనమైన మహాద్భుతసృష్టి




ఉన్నతమైన పనితనం కోసం
సంపూర్ణంగా పరీక్షించబడింది,
రెండుసార్లు నాణ్యత పరిశీలనలకు గురి
చేయబడింది. సాంకేతిక నిపుణులు
కాలానుగుణ్యంగా రూపొందించిన
అద్భుత సృష్టి – డిజియానా. మిరుమిట్లు
గొలిపే కలర్, బ్లాక్ అండ్ వైట్ రకాలు
అందరికీ అందుబాటులో వున్నై!

# డిజియానా

**స్పష్టతకు ప్రాణం! ఉత్కృష్టతకు జీవం!!**

మా సేవాకేంద్రాలు దేశవ్యాప్తంగా మీకోసం ఎదురుచూస్తున్నై!

kiron/ai/85

# దేశభక్తికి భాష అవరోధం కాదు

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

మిగతా దేశాలలో జాతుల మధ్య ఘర్షణలు జరుగుతుంటే మనదేశంలో వేర్వేరు భాషలు మాట్లాడే వారి మధ్య అల్లర్లు చెలరేగుతున్నాయి. గోవాలో అధికార భాషగా మరాఠీ ఉండాలనే వారికీ, కొంకణి మాత్రమే కావాలని వాదించే వాళ్ళకీ మధ్య వివాదం తల ఎత్తటానికి రంగం సిద్ధమవుతున్నది. వాస్తవానికి గోవన్‌లలో చాలా మంది మరాఠీ మాట్లాడరు. అక్కడ ఎంతో మంది రాయడానికి ఉపయోగించకపోయినా కొంకణి భాషనే మాట్లాడుతారు. బెల్గాం మహారాష్ట్రకి చెందాలా లేక కర్నాటకకి చెందాలా అన్న వివాదం పొరుగున ఉన్న మహారాష్ట్రలో నిరంతరంగా ఉంటూనే ఉంది. దానికి తోడు బాల్‌ఠాకరే కూడా ఈ గొడవలో దిగుతామని బెదిరించారు. కేంద్రం నించి గ్రాంటులు తీసుకునే సంస్థలకి ఈ మధ్య కొత్తఢిల్లీ నించి ఒక సర్క్యులర్ అందింది. ఆ సంస్థల దినచర్య అంతా హిందీలోనే జరగాలని అందులో ఉన్నది. దానిమీద ఇటీవలే పార్లమెంటులో దక్షిణాదిలో హిందీ వాడకం అన్న దానిపై చర్చ జరిగింది.

ఈ రకమైన భాషా సమస్యతో సతమత మవుతున్నది మనం ఒక్కళ్ళమే కాదు. భాషా పరమైన అల్లర్లు యూరోప్‌లో కూడా ఉన్నాయి. భాషా విషయంగా చాలామంది బెల్జియన్‌లు తమలో తాము తగవులాడు కుంటున్నారు. కొందరు ఫ్రెంచి భాష కావాలంటే మరికొందరు బెల్జియన్ భాషే ఉండాలంటున్నారు. ఆ దేశంలో ప్రధానంగా మాట్లాడే భాషలు ఆ రెండే. బ్రిటన్‌లో వెల్ష్ జాతీయవాదులు, స్కాటిష్ జాతీయవాదులు ఉన్నారు. ఆ రెండూ బ్రిటన్‌లో ఒక భాగంగా ఉండాలా లేక విడిపోవాలా అన్న దానిపై కొద్ది సంవత్సరాలకి ముందే జనవాక్య సేకరణ జరిగింది. దానికి కారణం భాషాపరమైన సమస్యే. ఇంగ్లీషు, వారి భాషని బలవంతంగా అణచి వేస్తున్నదని వెల్ష్‌వారి అభియోగం. దక్షిణ సరిహద్దు ప్రాంతంలో స్కాట్‌లు అల్పసంఖ్యాకులు కాబట్టి వాళ్ళు ఈ విషయాన్ని అంతగా ఆలోచించరు. ఇంగ్లాండ్‌లో ఏ ప్రాంతానికి చెందిన వాడివని స్కాట్‌ని ఎవరినైనా అడిగితే అతను కోపంతో చిందులు తొక్కి మండిపడతాడు.

వెల్ష్‌లన్నా, స్కాట్‌లన్నా, కొంకణి భాషె మాట్లాడాలని పట్టుపట్టే గోవన్‌లు అన్నా నాకు వ్యక్తిగతంగా పూర్తి సానుభూతి ఉన్నది. భాష అన్నది ప్రధానంగా సంస్కృతికి మూలాధారం కాబట్టి ఆ రెండిటికీ ప్రాముఖ్యత తప్పకుండా ఉంటుంది. సంస్కృతికి నిర్వచనం చెప్పాలంటే కొన్ని సంపుటాలు రాసినా సాధ్యంకాని విషయం. అయితే సంస్కృతి అనేది ఒక జాతి యొక్క స్మృతుల సముదాయంగా చెప్పవచ్చు. దానిని ఒక తరం తర్వాత మరొక తరానికి అందించడానికి సాధనం వంటిది భాష. మానవ శరీరంలోని జీన్ ఎలాగైతే ఒక కుటుంబంలోని లక్షణాలని తరువాత తరాలకి సంక్రమింప చేయడానికి ఉపయోగపడుతుందో అలాగే భాష ఒక జాతి సంస్కృతిని భావితరాలకి అందచేయటానికి అవసరమవుతుంది. భాషని నాశనం చేస్తే సంస్కృతి అంతరిస్తుంది. భాష లేకపోతే సంస్కృతికి మనుగడే ఉండదు. హిట్లర్ హయాంలోని జర్మనీలో నాజీలు స్కూళ్ళలో, బహిరంగ ప్రదేశాలలో ఇడ్డిష్ భాషని నిషేధించారు. వారి ప్రధానోద్దేశ్యం ఆ భాషని రూపుమాపాలని కాదు, అసలు యూదు సంస్కృతినే అంతం చేసి తద్వారా జర్మన్ స్మృతి పథంలో నించి యూదుల జ్ఞాపకాలని చెరిపి వేయాలని. ఆ ప్రయత్నంలో విఫలమైన నాజీలు నేరుగా యూదులనే ఏరివేయడం ప్రారంభించారు. కానీ అది కూడా ఫలించలేదు. యూదులు తమ భాషని కాపాడు కోటానికి శక్తివంచన లేకుండా ప్రయత్నించారు. భాష లేకపోతే సంస్కృతి లేదు, సంస్కృతి అనేది లేకపోతే అసలు జాతే ఉండదని యూదులకి తెలుసు కాబట్టి దానిని వాళ్ళు రక్షించుకున్నారు.

భారతదేశానికి సంబంధించినంత వరకు ఇది నిజం కాకపోవచ్చు. వెల్ష్, స్కాట్‌ల లాగే మహారాష్ట్ర లేదా కర్నాటక రాష్ట్రాల వారు తమ భాషలు వేరు కాబట్టి తాము భిన్నమైన వాళ్ళమని, వేరే జాతి వారిమని భావిస్తారు. కానీ వెల్ష్‌లు, స్కాట్‌లు బయటి వారి దృష్టిలో బ్రిటిష్‌వారే. అదే విధంగా మనం అందరం విదేశీయుల దృష్టిలో భారతీయులమే. గోవన్‌లు కొంకణి భాషే ఉండాలని పట్టుబట్టటానికి కారణం అది మరాఠీ కన్నా మెరుగైనదని కాదు, దానికీ దీనికీ తేడా ఉండటమే. మహారాష్ట్ర నించి తమదైనటువంటి ప్రత్యేకతని, సంస్కృతికి సంబంధించిన స్వేచ్ఛని సంపాదించుకోడానికి తమ భాష మరాఠీగా ఉండకూడదని గోవన్‌లు అనుకుంటున్నారు. మనుషులందరూ ఒకేలా ఉన్నా ఎవరికి వారికి పేర్లలో తేడా ఉన్నట్లే సంస్కృతికి సంబంధించిన స్వేచ్ఛని సాధించేందుకు భాషలో కూడా తేడా ఉండాలి.

జపాన్‌కి మిగతా దేశాలన్నిటి కన్నా విదేశీ వాణిజ్యం ఎక్కువ కాబట్టి అక్కడి ప్రజలు అనేక భాషలు మాట్లాడే వారుగా ఉంటారని ఎవరైనా అనుకుంటారు. కానీ ఆ దేశంలో ఇంగ్లీషు మాట్లాడే జపాన్ వారు చాలా అరుదుగా కనిపిస్తారు. ఎక్కడికి వెళ్ళినా జపాన్ భాష తప్ప మరొకటి వినిపించదు. ఒక పెద్ద డిపార్ట్‌మెంట్ స్టోర్స్‌లో సాధారణంగా ఇంగ్లీషు మాట్లాడే సేల్స్‌గరల్ అంతస్తుకి ఒక్కరు మాత్రమే ఉంటారు. ప్రత్యేకమైన ఇబ్బంది మీకేదైనా ఎదురైతే ఎంతో సేపు ఆమె కోసం మీరు పడిగాపులు కాస్తూ ఉండవలసిందే. పారిస్‌లో చాలా భాగం ప్రయాణికులు పర్యాటకులే అయినప్పటికీ అక్కడ ఇంగ్లీషు మాట్లాడే టాక్సీ డ్రైవర్ నాకు ఇంతవరకు తటస్థ పడలేదు. ఒకసారి నేను వెళ్ళినప్పుడు అక్కడి టాక్సీ డ్రైవర్‌ని ఇంగ్లీషు ఎందుకు నేర్చుకోలేదని అడిగాను. దానికి అతను "నేను ఫ్రెంచివాడిని కాబట్టి, ఇంగ్లీషువాడ్ని కాదు కనుక" అని అన్నాడు.








# గోపి

## వంటింటి మర




మర వేసిన పదార్థాన్ని సేకరించేందుకు గుండ్రని పాత్ర అదనం.

## ఉచితం! నిర్లిప్

మరకలు పడని పెద్ద దోసెకాడను



ప్రతి గోపి మిక్సీతో బాటు ఉచితంగా పొందవచ్చు! త్వరపడండి! ఈ సదుపాయం కొద్దిరోజులు మాత్రమే!

"వంటింట్లో గోపీ నాకెదురుగా వుంటే కష్టం తెలీకుండా పనిని చకచకా చేసుకుపోగల్ను! ఎందుకో తెల్సా? మూడు జార్లు, ఒక మెషీన్‌తో బాటు ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో గోపీ వుంటాడు – వీటన్నిటికీ అదనంగా ఖర్చు పెట్టాల్సిందేమీ లేదు.

పొడులు చేసుకోవాలనుకున్నా, పిండి రుబ్బుకోవాలనుకున్నా, క్షణాల్లో అందుకనుగుణంగా మార్చగల సౌకర్యం గోపీ దగ్గరే వుంది.

ఇంతేకాక కొన్ని ప్రత్యేకమైన పనులకు అవసరమైన అనుబంధ పరికరాలు చాలా వున్నాయి గోపీ దగ్గర. ప్రతిదీ విడివిడిగానే వుంటుంది. వాటిని విడివిడిగా కొంటే నాకెంత ఖర్చవుతుందో, గోపీవల్ల నాకెంత డబ్బు ఆదానో ఒకసారి ఆలోచించండి!

గోపీకున్న భారీ స్తోమతగల మోటారును నేను ఎంతసేపైనా నిర్భయంగా ఉపయోగిస్తాను. వంటింట్లో గోపీవుంటే చాలు. వంటింట్లో పని రాకెట్ స్పీడుతో జరిగిపోతుంది నాకు.

కొత్తమార్పులతో రూపొందించిన లాకెట్టి సిస్టం, స్క్రాపర్ లిడ్, మరియు బహు విధాలుగ వుపయోగించే అందమైన థర్మోకోల్ ప్యాకింగుతో లభ్యమయ్యే గోపీ నిస్సందేహంగా మిక్సీల రాజే!

కొత్తమార్పులతో రూపొందించిన లాకెట్టి సిస్టం, స్క్రాపర్ లిడ్, మరియు బహు విధాలుగ వుపయోగించే అందమైన థర్మోకోల్ ప్యాకింగుతో లభ్యమయ్యే గోపీ నిస్సందేహంగా మిక్సీల రాజే!



# గాంధిటెక్స్

## కాటన్ శారీస్

మా వెరైటీస్

999
888
777
666

'గాంధిటెక్స్' కాటన్ శారీస్‌లో అందాల తార **విజయశాంతి**

గాంధిటెక్స్, కాటన్ చీరలు అన్ని షాపులలోను దొరుకును.

ఎ. పి. డిస్ట్రిబ్యూటర్సు : శ్రీ లక్ష్మి క్లాత్ స్టోర్సు, 57, వస్త్రలత, విజయవాడ-1. గిరిజా శారీ బ్రదర్సు, 136-ఎ, వస్త్రలత, విజయవాడ-అమర నాగేంద్రుడు అండ్ సన్స్, 111, వస్త్రలత, విజయవాడ-1. బాలాజీ టెక్స్‌టైల్స్ సుభాష్‌రోడ్డు, సికింద్రాబాద్

H. K. International/GS/9

# న్యూఢిల్లీ లేఖ

అంతే కాకుండా తాను చక్కని ఇంగ్లీషు మాట్లాడగలనని కూడా చెప్పాడు అతను నిజమే చెప్పాడని నాకు అనిపించింది.

ఎన్నో శతాబ్దాల చరిత్ర కల యూరోప్‌లోనే అన్ని భాషలు ఉన్నప్పుడు మనకి మాత్రం ఎందుకు ఉండకూడదో నాకు అర్థం కావటం లేదు. జాగ్రత్తగా గమనిస్తే ఎన్నో దేశాలకి వాటి స్వంత భాష అన్నది ఒకటి ఉంటుంది. ఆ భాష పేరునే ఆ దేశాలు పిలువబడుతున్నాయి. ఇంగ్లీషువారు ఇంగ్లీషు భాష మాట్లాడుతారు. ఫ్రెంచి వాళ్లు ఫ్రెంచ్ భాష మాట్లాడుతారు. స్పానియార్డ్‌లు స్పానిష్, పోర్చుగీసు వాళ్లు పోర్చుగీసు, జర్మన్‌లు జర్మన్, చివరికి డెన్మార్క్‌తో సహా చిన్న చిన్న స్కాండినేవియన్ దేశాలన్నిటికీ వాటి భాషలు వాటికి వేరు వేరుగా ఉన్నాయి. మనమంతా భారతీయులం అన్నట్లుగానే వాళ్లంతా యూరోపియన్‌లు. వాళ్లందరూ ఏ భాష మాట్లాడినా వారిలో వారు బాగానే సర్దుకుపోగలుగుతున్నారు. భారతీయులమైన మనం అలా కాకపోయినా వచ్చీరాని హిందీ, బెంగాలీ, మరాఠీ భాషలని మాట్లాడుతూ ఏదో విధంగా ఒయటికి సర్దుకుపోతున్నాము.

అమెరికాలో పరిస్థితులు వేరు. ఆ దేశం విభిన్నమైనటువంటిది. అమెరికా వారి మార్గాన్ని అనుసరించాలా లేక యూరోపియన్‌ల దారిలో వెళ్లాలా అనేది మనం తెల్సుకోవాల్సిన విషయం రెండవ వారి విషయంలో ప్రతి వ్యక్తి యూరోపియనే కానీ అతను మరింకేదో జాతికి చెందిన వాడుగా కూడా ఉంటాడు. అయినా ఆ రెండిటి మధ్య ఎప్పుడూ సంఘర్షణ తల ఎత్తదు. మనలో ఉన్నటువంటి ఈ భిన్నత్వాన్ని దృష్టిలో పెట్టుకుంటే యూరోపియన్ పద్ధతే మంచిదని నాకు అనిపిస్తున్నది. అది మనకి తగినటువంటిదే కాక నాగరికమైనదని నా అభిప్రాయం. అమెరికాకి వలస వెళ్లిన వారు సాధ్యమైనంత వరకూ తమ అసలు సంస్కృతులని వదలి పెట్టి అక్కడ ఉన్న కొత్త ఉమ్మడి సంస్కృతిని స్వీకరించడానికి ప్రయత్నిస్తారు అలాగే మనం కూడా ఎందుకు చెయ్యకూడదు అన్న దానికి కారణం నాకు కనిపించడం లేదు. మనం ఇన్నేళ్ల పాటు మనగలిగాము. మనం మన సంస్కృతి దెబ్బ తినకుండా పోరాటాలు సాగించాము ఏది ఏమైనప్పటికీ మనకి కొన్ని పరిపాలనా సంబంధమైన తప్పనిసరి అయిన విషయాలు ఉన్నాయి. కానీ అవసరం కలిగినప్పుడు వాటిని కొద్దిగా మార్చడానికి అభ్యంతరం ఎందుకు ఉండాలి అన్న దానిక సరైన కారణం నాకు కనిపించదు. కొంకణి భాషే ఉండాలని పట్టుపట్టే గోవన్, తెలుగే కావాలనే ఆంధ్రుడు ఫ్రెంచి భాషనే యూరోప్‌లో మాట్లాడాలని పట్టుపట్టే ఫ్రెంచివాడి కన్నా జాతి వ్యతిరేక శక్తి కాబోడు. దేశభక్తిని నిరూపించుకోటానికి భాష విషయంలో వెనుకంజ వేయనవసరం లేదు. □

# రాజకయ్యాలు

—శంకు









## ఉత్తరాలు

### శుభాకాంక్షలు

మా పాఠకులు, రచయిత(త్రు)లు, ఏజంట్లు, ప్రకటన కర్తలందరికీ క్రిస్మస్; నూతన సంవత్సర శుభాకాంక్షలు
-సం.

### ముఖచిత్రం

ఆంధ్రుల అందాల తార బ్యూటి క్వీన్ రాధ ముఖచిత్రముతో వెలువడిన 22-29 నవంబర్ సంచిక చాలా ఆకర్షణీయంగా వున్నది.

ఏ. వసుంధర, తిమ్మాపురం

* * *

తులసి పూజలునాడు 'తులసి' (నటి) ముఖచిత్రంతో వెలువడిన మీ పత్రిక ఎంతో బాగుంది.

బందిగి బాలరాజు, నారాయణపేట

### వ్యాసాలు

నటి తులసి ముఖచిత్రంతో వెలువడిన ఈ వారం ఆంధ్ర సచిత్ర వారపత్రికలో పల్లవ శిల్పకళా వైభవం వ్యాసం అద్భుతంగా వుంది. తెలియని చరిత్రని అర్థమయ్యేలా తెలపటమే కాకుండా శిల్ప కళా వైభవాన్ని కళ్ళకు కట్టినట్లు వర్ణించి, ఫోటోలు ప్రచురించినందుకు చాలా సంతోషం కలిగింది. ప్రత్యక్షంగా చూస్తున్న అనుభూతి పొందానంటే నమ్మండి.

మోటమర్రి బేబీ కళ్యాణి
బెండమూర్లంక

### సీరియల్స్

"విన్నకోట సుశీలాదేవి" కలం నుండి వెలువడుతున్న "నీడలు - నిజాలు" సీరియల్ వాస్తవానికి చాలా దగ్గరగా వుంది. నా హృదయాన్ని ఎంతో ఆకట్టుకొంది.

శిరువెళ్ళ భాస్కరరావు, కంభం

### ఉద్యమించాలా?

ప్రజాస్వామ్య యుగంలో అధిక సంఖ్యాకులైన పాఠకులు శ్రీ జయదుబాషిగారి వ్యాసాలు ఆంధ్రపత్రికలో ప్రచురింపవద్దని పదే పదే ఉత్తరాలు వ్రాస్తున్నా సంపాదక వర్గమువారు ఎందుకు ప్రచురిస్తున్నారో అర్థకావడం లేదు. ఏ కొంత ఇంగిత జ్ఞానము గల పాఠకులకు ఆ రచనలు జుగుప్స, చిదరింపు కలుగుతుంటే ఎందుకు ప్రచురిస్తారు? ఆంధ్ర పాఠకులు, "శ్రీ దుబాషి గారి వ్యాసాలు ప్రచురణ ఆపేవరకు ఆంధ్రపత్రిక కొనము". అని ఉద్యమము లేవదీసే దాకా ప్రచురిస్తుంటారా? ఈ విషయమై ఆంధ్ర పాఠకుల ఐక్యత, బలం రుచి చూపించాలా? త్వరగా తేల్చండి.

యం. నాగరాజారావు, సత్తెనపల్లి




# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)

27, డిసెంబరు, '85-2 జనవరి, '86
శ్రీ క్రోధన నామ సం. మార్గశిర. శు. పూర్ణిమ
సంపుటము 78 : సంచిక 16

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-50 |
| పోస్టులో 6 నెలల చందా | రు. 71-50 |
| పోస్టులో 12 నెలల చందా | రు. 143-00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
"పట్నంపిల్ల-పల్లెటూరి చిన్నోడు"లో
సుహాసిని

కథలు :



సీరియల్ నవలలు:



వ్యాసాలు, శీర్షికలు :

# క్రిస్మస్

'క్రీస్తు' జయంతి సంకేతపర్వదినం 'క్రిస్ మస్'.

'క్రీస్తు' అను హిబ్రూ భాషాపదమునకు 'అభిషిక్తుడు' అని అర్థము. అనగా మానవకోటిని పాపపంకమునుండి వెలికిదీసి వారిని రక్షించుటకు అభిషేకించబడిన వాడని అర్థము.ఏ ఒక్క జాతికి, ఏ ఒక్క దేశానికి ఏ ఒక్క కాలానికి పరిమితంగాని అలౌకిక భగవద్రాజ్యానికి 'అభిషిక్తుడు' అని వేరొక అర్థం. 'మాస్' అనగా 'ఆరాధించుట' అని అర్థము. కరుణామయుడైన ఆ మహనీయుని స్మృతికి శ్రద్ధాంజలి ఘటించే ఆరాధనా పర్వం కనుక 'క్రీస్తుమాస్' (క్రిస్మస్) గాపేరొందినది.

ప్రేమ, కరుణ, త్యాగం, మానవసేవ ఇత్యాదిగాగల సుగుణ సంపత్తికి విపుల వ్యాఖ్యానం జీసస్ జీవనం. విశ్వ జనులకు పూజాభాజనం. యేసుక్రీస్తు జయంతి జగజ్జనులకు స్ఫూర్తి దాయకమైన శుభదినం. ప్రమోదాయక మైన పర్వదినం.

క్రిస్మస్ వేడుకలలో 'క్రిస్మస్ ట్రీ' అలంకరణ కడు ప్రాధాన్యం వహించి యున్నది. అంతేగాక శాంటాక్లాస్ (క్రిస్మస్ తాత) వేడుకలు, క్రొవ్వువత్తుల అలంకరణ కూడ ప్రధాన వేడుకలైయున్నవి. ఈ వేడుకల ఆచరణలో ఆంతర్యం, అంతరార్థం లేకపోలేదు.

## 'క్రిస్మస్ ట్రీ' పూర్వోత్తరాలు

బైబిల్‌లో క్రీస్తు "నేను అసలైన ద్రాక్షవల్లిని. మీరెల్లరూ నాతలలు. శాఖలు" అని ప్రవచించినందున క్రీస్తుకు సంకేతంగా 'క్రిస్మస్' సమయంలో 'క్రిస్మస్' చెట్టును ప్రతిష్ఠించి ఆరాధించి కరుణామయుడైన క్రీస్తునీడలో ఆత్మీయ విశ్రాంతి పొందగలగాలనే పవిత్ర ధ్యేయంతో క్రిస్మస్ ట్రీ ఆచారం రూపొందినదని భావించ బడుచున్నది.







క్రీస్తు జననం

రేఖా చిత్రం : ద్రోణాదుల ఛాయా శిల్పి

క్రిస్మస్ ట్రీ ఆచారం తొలుదొలుత 1605లో జర్మనీలోని 'స్ట్రాస్‌బర్గ్'లో ప్రారంభమైనది. తదుపరి 1840లో ఇంగ్లాండ్‌లో ప్రవేశించినది. దీనికి సంబంధించిన గాథకూడ యున్నది. ఇంగ్లాండ్‌లో మొట్టమొదటగా పెరిగిన మొక్కను ఇంగ్లాండు దేశీయులు' "క్రైస్ట్ సాధారకో" అనిపిలుస్తారు. 'జోసెఫ్' అనే ఆయన పాలస్తీనానుండి ఇంగ్లాండుకు వస్తూ అచటనుండి ఒక 'బెర్రి' మొక్కను తెచ్చి నాటాడట అది క్రిస్మస్‌నాడు కొత్త ఆకులు చిగిర్చి పుష్పించిందట. నాటి నుండి క్రిస్మస్ ట్రీ ఆచారం అమలులోకి వచ్చిందని చెప్పబడుచున్నది. ఆకుపచ్చని 'బెర్రి' ఆకులు, క్రీస్తుజననానికి ఎర్రని బెర్రి పళ్ళు సిలువపై ఏసుచిందించిన రక్తానికి సంజాతులని. వీరు భావించి ఈ చెట్టును 'క్రిస్మస్ ట్రీ' గా పూజిస్తారు. మన ప్రాంతంలో ఈ మొక్కలు లభించనందున వాటికి బదులు 'చవుకు' మొక్కలు క్రిస్మస్ ట్రీలుగా ప్రతిష్ఠించబడి అలంకరించ బడుచున్నవి.

క్రిస్మస్‌కు క్రొవ్వొత్తులు వెలిగించి క్రిస్మస్ ట్రీ వద్ద అలంకరించటం పరిపాటి. ఇందులో అంతరార్థం లేకపోలేదు. క్రీస్తు 'నేనే ఈ జగతికి వెలుగునైయున్నాను అని చెప్పిన మరో బైబిలు వాక్యం దృష్ట్యా జ్ఞాన జ్యోతికి చిహ్నంగా 'క్యాండిల్స్' వెలిగించుట ఆచారంగా రూపొందినది.

## 'క్రిస్మస్ తార' గాథ

క్రీస్తు జనన సమయమున అనంతాకాశంలో అగణిత తారాగణాన్ని మరపించే మహాకాంతితో ఒక దివ్య నక్షత్రం తూర్పున ఉదయించి క్రీస్తు జనన వృత్తాంతాన్ని పరిసరాలలోని గొర్రెల కాపరులకు సూచించి క్రీస్తు జన్మ సమయాన ప్రత్యేక పాత్ర వహించిన కారణమున క్రిస్మస్ సందర్భంలో నాటి క్రిస్మస్ ఉజ్వల తారను స్ఫురణకు తెచ్చేరీతిగా 'క్రిస్మస్ ట్రీ'కి నక్షత్రాకారాలను వ్రేలాడదీయుట




...ఆచారమైనదని భావించవచ్చును.

## 'క్రిస్మస్' కానుకలు

క్రిస్మస్ పండుగ సందర్భంలో ఒకరి కొకరు కానుకలందించు కోవటం ఆచారం. దీనికి పూర్వగాథ యున్నది క్రీస్తు పుట్టిన విషయాన్ని దివ్య నక్షత్రం ద్వారా తెలుసుకొన్న ముగ్గురు ప్రాచ్యదేశాల జ్ఞానులు ఆశిశువును వెదుక్కొంటూ వచ్చి ఎవెవో కానుకలు ఆ శిశువునకు సమర్పించినట్లు క్రీస్తు పుట్టుక గాథ వలన విదితమగుచున్నది అలా క్రిస్మస్ సందర్భంలో కానుకలు ఇచ్చే అలవాటు నాటితోనె ఆరంభమైనదని. అదే ఆనవాయితీగా ఇంటింటా ... ... కానుకలు ఇచ్చే అలవాటు

ఏర్పడినదని ఊహించబడుతున్నది

## 'క్రిస్మస్ తాత' గాథ

పూర్వం 'సెయింట్ నికొలస్' అనే బిషప్ వర్తకు డుండేవాడట అతడు పేదవారికి ఏ లోటు రానియక వారు కోరుకొనే వాటిని గ్రహించి వాటిని సమకూర్చేవాడట అతనికి ఎల్లలంటే ప్రీతి. ఎల్లలకు రకరకాల కానుకలు, మిఠాయిలు అందించే వాడట ఆ 'సెయింట్ నికొలస్'

క్రిస్మస్ కానుకలు



(శాంటాక్లాస్) క్రిస్మస్ తాతయ్యగా ప్రతీతి పొందాడు.

క్రిస్మస్ వేడుకలలో ముఖ్యమైనది 'క్రిస్మస్ తాత' ఆగమనం. రెయిన్‌డీర్ జింకలచే లాగబడే 'స్లెడ్జ్' బండిపై ఎర్ర దుస్తులు, తెల్లగడ్డం, తలపై పొడుగాటి టోపీ ధరించి క్రిస్మస్ నాడు చప్పుడు




కాకుండా వచ్చి, తాను తెచ్చే రకరకాల కానుకలు రాత్రిపూట క్రిస్మస్ ట్రీ క్రింద వుంచి వెడతాడని ప్రతీతి. పాశ్చాత్య దేశాలలో ఈ నమ్మకం ప్రబలంగా వుంటుంది. పెద్దలే కానుకలు క్రిస్మస్ ట్రీ క్రింద ఉంచి క్రిస్మస్ తాత తెచ్చి వుంటాడని ఎల్లలను భ్రమింపచేస్తుంటారు

ఇలా అనేక ఆచారాలతో జరుపబడే 'క్రిస్మస్' నిఖిల ప్రజాళికి ప్రమోదదాయక పర్వదినం! స్ఫూర్తిదాయకమైన శుభదినం! శకపురుషుడైన క్రీస్తు పవిత్ర గాథను స్మరణకు తెచ్చి అంజలి ఘటింపచేసె అత్యంత పునీత దినం!

—విశాలి

## రెడ్. సీరియల్



"వో(గత సంచిక తరువాయి)ల్లకోయే... ఆమాత్రం నొప్పులు బరించలేని దానివి బతుకేటి బతుకుతావ్? బతుకు బండేం లాగుతావ్?" కసురుకుంది, రావులమ్మ కాళ్ళుపట్టుకుని రాస్తున్న ఆదిలచ్చిమి. మరొకతె - ఎప్పుడు రావులమ్మ బిడ్డని బయట పడేస్తుందా, బొడ్డుకోసి పోదామా అని చూస్తూంది.

"ఏమిటమ్మా? ఇదేం మొదటిసారా? ఇప్పుడెన్ని కేకలు వేసి ఏం లాభం? అసలప్పుడు ఉండాలి కాని...." వేళాకోళం చేస్తూంది మంత్రసాని - పాపారావు భార్యని.

"ఈ యింజక్షన్... మీకేమి నొప్పి తెలియదు. ప్లీజ్... ఒక్క నిముషం..." వెంకటేశ్వర్రావుగారి భార్యను బ్రతిమాలుతోంది డాక్టరు. కాలం కదులుతోంది.

మైకు మళ్ళీ పనిచేయసాగింది. యోగి - ఉపన్యాసం పునః ప్రారంభించాడు... "ఆఁ... ఎంతవరకూ వొచ్చాం? ఆఁ... మనుషులు... పుట్టేటప్పుడు. సమానమే.."

అదే క్షణంలో...

"క్యార్. క్యార్..' గుడిసెలో రాములమ్మ ఎంకటేసుని కంది.

"క్యార్... క్యార్..." మెటర్నిటి హోమ్‌లో శ్రీమతి వెంకటేశ్వర్రావు నిఖిల్‌కి జన్మనిచ్చింది.

"క్యార్ క్యార్..." అద్దె యింటి గదిలో - గుమాస్తా పాపారావు పెళ్లాం రామారావుని కన్నది.

· ఒకే ఒక్క క్షణంలో -

మెటర్నిటి హోమ్‌లో... పాపారావు అద్దె యింట్లో... లేబర్ కాలనీ గుడిసెలో.. ముగ్గురు మగ శిశువులు జన్మించారు. ఒకే రోజున - ఒకే గంటలో... ఒకే నిముషాన.. ఒకే క్షణంలో జన్మించిన ఆ ముగ్గురూ -

పేద .. మధ్య తరగతి... ఐశ్వర్యవంతులు అనే ముప్పేటలతో కూడిన యీ సమాజంలో; త్రివేణి సంగమంలాటి యీ వ్యవస్థలో - ఎలా పెరుగుతారో?

వేదిక మీద.. ఎన్నికల ఉపన్యాసమిస్తున్న స్వామివారు నమ్మ చెప్పబోతున్నట్లు - సమానంగానే పెరుగుతారా?

లేక... కుల... మత; పేదరిక - ఐశ్వర్య; అధిక - అల్ప... తారతమ్య సర్పాల కాట్లకు బలిపోతూంటారా? మాటలతో - స్వామిగారు కలలు కనిపిస్తున్న సమసమాజం వీరి కందుబాటులోకి వొస్తుందా? లేక అది - కలా, కల్లయేనా?

వేచి చూడవలసిందే - కాలంతో.

### 3

ఆ హాస్పిటల్ ముందు జనాలు క్యూలు కట్టి నిలుచున్నారు. చిన్న చిన్న పిల్లల నెత్తుకుని తల్లులు. వారికి కాపలాగా మగవాళ్ళు. చంటి పిల్లలున్నారు కనుక ఏడుపులు. కనుక అక్కడ గోలగా ఉంది. క్యూ చివర (మొదట?) చిన్నగది. దానిలో ఓ కంపౌండర్రూ... ఓ డాక్టరూ... నర్సూ.

డాక్టరు - ఇంజక్షన్ పొడిచేస్తున్నాడు - పిల్లలకి వరసపెట్టి. వాళ్ళు ఏడుస్తూంటే నర్స్ డ్రాపర్‌తో నోట్లో రెండు మూడు బొట్లు రాల్చుతూంది.

ఆ యింజక్షను - ట్రిపులాంటిజన్

ఆ డ్రాప్స్ - పోలియో డ్రాప్స్.

పిల్లలకి భవిష్యత్తులో... డిఫ్తీరియా. పోలియోవంటి భయంకర వ్యాధులు సోకకుండా ఆ యింజక్షనూ డ్రాప్సును, రక్షణ.

పాపారావ్ తన పుత్ర రత్నాన్ని ఎత్తుకుని నిలబడ్డాడు క్యూలో... తనవంతు ఎప్పుడు వొస్తుందా అని.

అదే సమయంలో - వెంకటేశ్వర్రావుకి చెబుతోంది డాక్టరు. "మీరిక్కడ పోలియో వాక్సిన్ ఎంతమాత్రమూ వేయించవొద్దండి."

అతనికి ఆశ్చర్యం వేసింది. "అదేమిటి డాక్టర్? పోలియో వాక్సిన్ వేయించవొద్దంటా రేమిటి? అవి - పిల్లలకి చాలా అవసరంకదా... రేపు పోలియో రాకుండా కాపాడతాయి కదా?"

"నిజమే నేను కాదన్నది వాటి అవసరాన్ని గుణాన్ని కాదు నిశ్చయంగా ఆ వాక్సిన్ చాలా గొప్పదే కాని..." ఒక్క సారాగిందామె. "ఆ వాక్సిన్‌ని మీరివుళ్ళో వేయించి లాభం లేదు."

"ఎందుకని?"

ముఖం అదోలా పెట్టి.. చెప్పక తప్పడం లేదన్నట్లు... కంఠం తగ్గించి మెల్లగా. రహస్యంలాగ చెప్పసాగింది. ఆ వాక్సిన్ చాలా శక్తివంతమైనదే. కాని - అది మైనస్ ముప్ఫయిరెండు డిగ్రీలవద్ద మాత్రమే భద్రపరచాలి. చిన్న నగరాలకి పంపేటప్పుడు యీ టెంపరేచర్ గురించి జాగ్రత్త వహించరు. వచ్చాక కూడా - ఫ్రిజ్‌లో ఉంచాలి.

ఇక్కడ - ఇరవై నాలుగు గంటలూ కరంటూ ఉండదు. ఎప్పుడూ పోతూ వేస్తూ ఉండడమే డాక్టర్లు కూడా - కరంటు ఛార్జీలు తగ్గించుకోవాలని రాత్రిళ్ళు ఫ్రిజ్ ఆఫ్ చేసేస్తారు. అందుచేత.. టెంపరేచర్ మెయిన్టెనెన్స్ ఉండక వాక్సిన్ ప్రభావం కోల్పోతుంది. ఇంకా... మన డాక్టర్లు ముందు ట్రిపుల్‌యాంటిజెన్ ఇంజక్షను పొడుస్తారు. బిడ్డ ఏడుస్తూంటే డ్రాప్స్ వేస్తారు. ఆ ఏడుపులో యీ డ్రాప్స్ కడుపులోకే వెళ్తాయో

**జరిగినకథ -1** : ఎమ్మెల్యేకి పోటీ చేస్తున్న బాబా మునిసిపల్ గ్రౌండులో సర్వమానవ సమానత్వం గురించి ఉపన్యసిస్తుండగా, అతను గొంతెత్తి చాటుతున్న సమానత్వాన్ని పరిహసించడానికే అన్నట్లు టాపులేని కారులో ఎత్తయిన శయ్యలాగా అమర్చిన సీటు మీద ఐశ్వర్యవంతుడి శవం, ఏడుకట్ల సవారీపై ఒక సామాన్యుని శవం, చాపలో చుట్టి మునిసిపాలిటి వాళ్ళు ఈడ్చుకుపోతున్న బిచ్చగాడి శవం గ్రౌండు నానుకుని ఉన్న రోడ్డు మీద వెళుతూ వక్తయిన స్వాములవారి కంట పడ్డాయి. అదే క్షణంలో లేబరు కాలనీలోని సింహాచలం భార్య, ఖరీదైన మెటర్నటి నర్సింగ్ హోమ్‌లో వెంకటేశ్వరరావు శ్రీమతి, చిన్న అద్దె ఇంట్లో పాపారావు భార్య ప్రసవ వేదన పడుతున్నారు.

ఎక్కడికి వెడతాయో.. ఆ పరమాత్ముడికే తెలియాలి..'

మరెందుకు డాక్టర్లు ఉచిత వైద్యసేవ కంగీకరిస్తారు?"

ఆశ్చర్యంగా చూశాడు వెంకటేశ్వరరావ్

"పేషంట్ల నాకర్షించుకుని ప్రాక్టీసు పెంచుకోడానికి. ఒక విధమయిన పబ్లిసిటీ."

"ఐతే - యిక్కడ పోలియో డ్రాప్స్ వొట్టి దండగన్న మాట!"

"అంతే."

సరిగ్గా అదే క్షణంలో. పాపారావు కొడుకు నోట పోలియో డ్రాప్స్ వేసింది నర్స్. ఆ ఛంటివాడు అప్పటికే గుక్కపట్టి ఏడుస్తున్నాడు.

అదే క్షణంలో.

రాములమ్మ కొడుకు నిశ్చింతగా నిద్రపోతున్నాడు

పోలియో గురించి తెలిసి - సరయిన జాగ్రత్త తీసుకున్నాడు వెంకటేశ్వరరావ్ తన కొడుకు నిఖిల్ విషయంలో

పోలియో గురించి తెలిసినా . వాక్సిన్ వివరాలు తెలియక... ప్రభావం కోల్పోయిన డ్రాప్స్ వేయించేసి - జాగ్రత్త పడి పోయానని తృప్తి పడుతున్నాడు మధ్య తరగతి పాపారావ్ మిడి మిడి జ్ఞానంతో.

ఏమి తెలియని రాములమ్మ... తన అజ్ఞానంలోనూ అమాయకత్వంలోనూ నిశ్చింతగా ఉంది.



బిడ్డలు పుడుతూండగానే వాళ్లకేం పేర్లు పెట్టాలో మనసులో అనేసుకున్నా – భారీ ఎత్తున.. పెళ్లంత హడావిడిచేసి – తన కొడుక్కి నిఖిల్ అని నామకరణం చేశారు వెంకటేశ్వరరావు బాలసారె జరిపించి... రామారావ్ అని పేరుపెట్టి ఐదువందల అప్పు నెత్తిమీదకు తెచ్చుకున్నాడు పాపారావు. ఏమి లేకుండానే – ఓ క్షణంలో – ఎంకటేసూ అని పిలిచేసింది రావులమ్మ. నీ ఫ్రండ్సెవరో చెప్పు... నువ్వేమిటో చెబుతాను... అన్నట్లే – నీ పేరేమిటో చెప్పు నువ్వే తరగతికి చెందిన వాడివో చెబుతాను అని కూడా అనవొచ్చు సుమా అన్నట్లున్నాయి – వాళ్ల ముగ్గురి పేర్లూ. నిఖిల్... రామారావ్... ఎంకటేసు. ఐతే – పేరులోన నేమి పెన్నిధి యున్నదంటూ ముగ్గురు పిల్లలూ వారి వారి వాతావరణాల కనుగుణంగా పెరుగుతూనే ఉన్నారు.

నిఖిల్‌కి ఆయా... కేవలం ఆట వస్తువులకోసమూ ఆడుకుందుకూ ఓ గది. హాలులాటి ఆ గదిలో పట్టాలమీద పరుగెత్తే రైలు (టోయ్ ట్రియిన్.)... కీయిచ్చి వొదిలితే ఎగిరే విమానం... నడిచే ఎలుగుబంటి... గెంతులువేసే కుందేలు.

రామారావుకి బంతికొన్నాడు వాళ్లనాన్న. అప్పుడప్పు డెవరో యిచ్చిన ఆట బొమ్మలు కొంచెం.

ఎంకటేసుకి నడవడమే ఆట. కాళ్లూ చేతులే ఆట వొస్తువులు.

చిన్నప్పుడు కొన్న లక్కపిడత... దొండకాయ... రంగు వెలిసి – వాళ్లబతుకుల్లా అసహ్యంగా తయారయ్యాయి.

ముగ్గురికి ఐదేళ్లు రాబోతున్నాయి.

నిఖిల్ అప్పట్టికే ఊళ్లోని మంచి కాన్వెంటులో ఎల్. కె. జి; యు. కె. జి. పూర్తి చేశాడు. అది ఆంగ్లో ఇండియన్‌లు నిర్వహించే కాన్వెంట్. అక్కడ ఆకలీ దాహమూ కూడా ఇంగ్లిషులోనే వేయాలి. చెమట పట్టినా ఆగ్లంలోనే. వేషంలోనే కాకుండా భాషలోనూ నిఖిల్ అచ్చం దొరబాబే ఔతూ – తల్లితండ్రుల కానందం కలిగిస్తున్నాడు. అతని – నెల చదువు కర్చు – రెండు వందల యాభై.

నెలకి రెండువందల యాభయ్యి యిచ్చి –

# త్రివేణి

రామారావ్‌ని కూడా ఆ కాన్వెంటులో చేర్చాలని అనుకోక పోలేదు పాపారావ్ కాని... ఆయాసం అమ్మా... ఆవిడ మందులూ... పెరుగుతున్న ధరలూ, పెరగని జీతమూ .. హద్దుమిరుతున్న సంసారపు ఖర్చూ ,– అతని కళ్లముందు వాస్తవం అనే కొరడాను ఝుళిపించేసరికి–

అతను – నాలికకరుచుకుని – సారి చెప్పుకున్నాడు తనకితానే. అర్జంటుగా అక్షరాభ్యాసం జరిపించేసి – వీధి బళ్లో వేసేశాడు కొడుకుని. రెండువేలు డొనేషనూ... నెలకి రెండువందల యాభై జీతమూ కట్టి కాన్వెంటులో చేర్పించినా వొరిగేదేముంది? ఎక్కడ చెప్పినా ఆ అక్షర ముక్కలే కదా. కాకపోతే – కాన్వెంటులో అయితే దొరకూతలు వొస్తాయి తెలుగు అనేదిరాదు. ఇంగ్లిషు మినహాయిస్తే – మిగిలిన సబ్జక్టులేమి ఘనంగా చెప్పెయ్యరక్కడ. అయినా – స్కూళ్లలో చదువు చెప్పే రోజులా యివి? పిల్లకి నాలుగు ముక్కలు రావాలంటే తల్లో తండ్రో పూనుకుని యింటి దగ్గర చెప్పాల్సిందే తనే చెప్పుకుంటాడు తన కొడుక్కి. బడి నామమాత్రమే – అని ఆత్మవంచన చేసుకున్నాడు పాపారావు.

ఎంకటేసుకి నడ్డికిందకి నాలుగేళ్లు వొచ్చేసరికి – చిన్న చిన్న పనుల్లో ఆరి తేరి పోయాడు. ఎక్కడయినా పుల్లముక్క కనిపిస్తే చాలు తెచ్చి గుడిసెలో పడేశాడన్నమాటే. ఆమాత్రం కాగితం ముక్క కనిపించిందో అమాంతం దాన్ని తెచ్చి యింట్లో పడేశాడన్నమాటే. కాని... విచిత్రంగా... వాడికి నర్సరి రైమ్స్ వొచ్చాయి తప్పులతోనో తడకలతోనో అందుకు కారణం లేకపోలేదు. సంగిత విద్వాంసుడింట్లో రాళ్లు కూడా రాగాలు పలుకుతాయో లేదో కాని – కాన్వెంటు పక్కనుండే పిల్లలకి రైమ్స్ రాకుండా ఉండవు. ఆ కాన్వెంటు – లేబర్‌కాలనీ వెనకిగానే ఉంది. ఆ కాన్వెంటు – పెద్ద తోటలో ఉంది. ఆ తోటలో ఎండు పుల్లలు దండిగా దొరుకుతాయి. కాన్వెంటు ముందరి రోడ్డుమిద – చిత్తుకాగితాలు మస్తుగా లభిస్తాయి అక్కడ ఆఫసులున్నాయి కనుక. ఎండుపుల్లలు దొరుకుతాయి కనుక – ఎంకటేసు కాన్వెంటు ఆవరణలో తిరిగేవాడు అందుచేత.... ఆ పిల్లలువల్లె వేసే రైమ్స్‌వాడికి అప్రయత్నంగానే వొచ్చేశాయి. వాడికేమి తోచకపోతే రోడ్డుమిద కూడా వాటిని చదువు (పాడు)కునేవాడు. అలావాడు పాడుతున్నప్పుడు విన్న ఓ బడిపంతులు... సమాజాన్నుద్ధరించాలనే ఆదర్శాలు కలవాడు. . ఎంకటేసు వెంటే గుడిసెకి వొచ్చి – రావులమ్మనీ ఆమె మొగుణ్ని చూసి.... "ఈ అబ్బాయి మి వాడేనా?" అని అడిగాడు. వాళ్లు కంగారు పడిపోయారు. "మాబొట్టుడే. ఏం బాబూ... ఏదయినా ఎదవపని చేశాడా?"

"వెధవ పని కాదు.... పాడాడు...."

"పాడుపనా!.... ఏటి చేశాడు?"

"ఉహుం.... నర్సరి రైమ్స్.... అంటే.... యింగ్లిషు పద్యాలు బాగా పాడాడు. మాంఛి చురుకయిన కుర్రాడు. నైవేద్యం పెట్టు నా మహిమ చూబిస్తానన్న దేముడే. చూడండి.... మి కుర్రాడు చురుకయిన వాడు. తెలివయిన వాడు. వీణ్ని చదివించండి. బడికి వెళ్లకుండానే పద్యాలొచ్చాయి. వెడితే యింకెన్నెన్ని వొస్తాయో...." తరవాత మి యిష్టం అన్నట్లు చూసి వెళ్లి పోయాడు.

"సదివిద్దారి మామా...." అంది రావులమ్మ.

"సదువంటే సవకనుకున్నావేటి? ఏటిట్టి సదివిస్తాం? మన కాడేటుంది పడిపోయిందని?"

"అదికాదు మామా.... మనోడు మంచి గుడ్డ లేసుకుని.... పలకా పుస్తకాలూ పట్టుకు బడి కెడుతూంటే ..." మురిసి పోయింది రావులమ్మ తన ఊహకి.

"పుల్లు లేరు కెవరొస్తారు? ఒసే.... సదువు.... మనలాటోళ్లక్కాదే. పొయ్యి కిందకి పొయ్యి మిదకి తడుముకో నక్కర్లేని మారాజులకి. మన బోంట్లకి.... కుర్రాడికి సదువు చెప్పించడమంటే– ఎర్రి కుదిరిందని రోకలి తలకు చుట్టు కోడమే. నీకంటి కాన్నం లేదేమో కాని ఆడూ సంపాయిత్తున్నాడు పొయ్యి కింద కాడు తెస్తేనే–



నువ్వు పొయ్యి మీద కెక్కించ గలిగేది"....

ఏమనలేక పోయింది రావులమ్మ. మొగుడు మాటలు నిజమే. పొయ్యి మీదకి యజమానీ... పొయ్యి కిందకి పిల్లలూ తెస్తేనే- పూర్తిగా కడుపులు నిండని బతుకులు తమవి. ఎంకటేసుని బడికి పంపితే- ఎనకా ముందూ కూడా నష్టమే. వాడు తెచ్చేది తేదు. వాడి చదువుకి పెట్టుబడి పెట్టాలి. ఎందు కొచ్చిందిలే.

ఎంకటేసలా అనుకోలేక పోయాడు. "నేనూ బడి కెల్తానమ్మా.... లాగూ చొక్కా బూడ్సులూ ఏసుకుని.... నేనూ బడి కెల్తానయ్యా...." అని రాగాలు తీయసాగాడు. సింహాచలం- నిషామీదున్నా శాంతంగానే ఉన్నాడు.

"అక్కడ.... బళ్ళో.... బలే గుంటదయ్యా.... గంటలు కొడతారు.... పాటలు పాడిస్తారు. ఆట్లాడిస్తారు. బస్సెక్కి ఎల్లొచ్చు...." అంటూ మారాము చేస్తున్న ఎంకటేసుని ఎత్తుకుని.... "బస్సేటి? లారియే ఎక్కుదువు గాని దేవుడు సల్లగా జూసి నాలుగేళ్ళు గడిస్తే...." అనేశా దనుకోకుండానే. ఆ మాట లేముహూర్తంలో అన్నాడో కాని.... నాలుగేళ్ళు కాదు.... మూడేళ్ళయినా పూర్తిగా గడవకుండానే నిజమయ్యే రోజు వొచ్చేసింది.

## 4

ఆవేళ....

"ఇంక యిక్కడ వొద్దండి. రెసిడెన్షియల్ స్కూలుకి పంపిద్దాం నిఖిల్‌ని. అక్కడయితే ఎడ్యుకేషన్ చాలా బాగుంటుంది." అంది ట్యూషన్ టీచరు.

"బాబుని వొదిలి ఉండడమా!" బాధగా భయంగా చూసింది శ్రీమతి వెంకటేశ్వరరావ్.

"బాబుకి బంగారు భవిష్యత్తు కోసం - పెద్దవాళ్ళు.... తల్లి తండ్రు లయిన మీరు కొన్ని వొదులుకోక తప్పదు. తల్లి తండ్రుల ప్రేమ- పిల్లల ఉజ్వల భవిష్యత్తుకు అవరోధం కాకూడదు కదా?"

వెంకటేశ్వరరావు కానీ ఆయన శ్రీమతి కానీ యింకేమీ అనలేక పోయారు. మౌనంగా ఉండి పోయారు.

నిఖిల్‌ని తీసుకుని వెళ్ళి పోయింది టీచర్.... పరీక్ష వ్రాయించడానికి. ఉన్న వూరుకి- వందల కొద్దీ మైళ్ళ ప్రయాణం. ఫస్ట్‌క్లాస్ ఎ.సి.లో ప్రయాణం చేసి చేరారావూరు. ఒకటో తరగతికి కూడా ఎంట్రెన్స్ పరీక్షే అంటే ఆ స్కూలు ఎంత గొప్పదో ఆలోచించుకోవచ్చు. అక్కడ ఎంత స్ట్రిక్టో అంత సరదాగా ఉంటుంది. ఎంత డిసిప్లినో అంత సౌఖ్యంగా ఉంటుంది. ఎంతగా చదువు చెబుతారో అంతగానూ మానసికోల్లాసం కలిగిస్తారు కుర్రవాళ్ళకి. కేవలం చదువేకాక.... యీత.... గుర్రపుస్వారీ.... టెనిస్ లాటి ఆటలు.... ఎన్నో నేర్పుతారు. చక్కని హాస్టలు.... మంచి మంచి గదులు. శుభ్రమయిన.... ఆరోగ్యమయిన భోజనం. అక్కడ - పిల్లల శారీరకారోగ్యమూ మానసికారోగ్యమూ కూడా పెంపొందించేవిగా ఉంటుంది వాతావరణము. ఒక్కొక్క విద్యార్థికి నెలకి ఎనిమిది వందల నుంచి పదివందల వరకూ

## త్రివేణి

పిల్లు చేస్తాయ చెర్పేటప్పుడు వేలకొద్దీ డొనేష నివ్వాలి. వెంకటేశ్వరరావు లాటి వణిక్ప్రముఖులకి ఒక లెక్కలోనిది కాదు కానీ-

పాపారావ్‌కి యీ అంకెలు వినేసరికి గుండె గుభేలు మంది.. తన కొడుకు రామారావు తెలివయిన వాడనీ...., బాగా చదు వొస్తుందనీ చెప్పారు మాస్టరు. "మంచి స్కూల్లో వేయించండి. వజ్రంలా ప్రకాశిస్తాడు. మా బడులు వొట్ట దుంపల బళ్ళు. కుర్రవాడిని పాడు చేయకండి." అని కూడా చెప్పారాయన. అప్పుడే తను- మంచి స్కూళ్ల గురించి వాకబు చేశాడు. అలా చేయగా తెలుసుకున్న దేమిటంటే- ఎంత చచ్చు మంచి స్కూలు కయినా కొన్ని వేల డొనేషనూ, వందల కొద్దీ నెల ఖర్చులూ తప్పని సరి అని. దానితో- రామారావుని అలాటి స్కూలులో ప్రవేశ పెడదామా అన్న కోరిక హూష్ కాకి ఐపోయింది. కొడుకుని చదివించాలంటే- కుటుంబం అంతా పస్తు లుండాలి. ఆ స్కూలు చదువులు గొప్పవే ఔగాక. బంగారపు కత్తని పీక తెగ్గోసు కుంటామా? ఎప్పుడో ఏదో కావొచ్చని- మబ్బులు చూసి.... నీళ్ళు వొలక బోసుకున్నట్లు తెలివి తక్కువగా వర్తమానం నాశనం చేసుకుంటామా? ఎవరి కర్మ కెవరు కర్తలు? యోగం బాగుంటే అన్నీ వాటికవే అమరుతాయి. అంతా భగవంతుడి దయ.... అని- భారం దేవుడి మీద వేసేశాడు.

పాపారావుకి రామారావొక్కడే కాదు. ఇద్దరాడ పిల్లలు కూడా ఉన్నారు. జీతంలో- వాళ్ల కడుపులూ నింపాలి. వాళ్ల బతుకులూ భవిష్యత్తూ కూడా ఆలోచించాలి. చేసిన మంచి పనేమిటంటే- రామారావు పుట్టగానే ఆపరేషను చేయించుకోడం. నిజానికి- ముగ్గుర్ని కనాలని తనకి లేదు. పాలకోసం రాళ్ళని మోసినట్లు- ఒక కొడుకు కోసం యిద్దరు కూతుళ్ళని కనవలసి వొచ్చింది. నయమే. గుడ్డిలో మెల్లగా అప్పటికేనా.... అంతటితో అయినా వొద్దన పడ్డాడు. ఫ్యామిలీ ప్లానింగ్ ఆపరేషన్ చేయించుకున్నందుకు యింక్రిమెంట్లు తీసుకో గలిగాడు. ఏం పిల్లలో.... ఏం సంసారమో.... నేరక పోయి గోతిలో దిగాడు. తన సరదాలన్నీ బలి ఐపోతున్నాయి. గాను గెద్దు బతుకై పోతూంది. ఎందుకీ జీవితం? ఏమిటి బతుకనిపిస్తూంది. ఈ బాధంతటికీ ముఖ్యకారణం చేతికి- తగినంత డబ్బు అందకుండా ఉండడం. ఆదాయం- ఖర్చులకి ఏనోదాలకి తగినంతగా లభించక పోవడం వల్లే బతకడం అంటే చిరాకేసేస్తూంది.

రత్నం - పెంట పోగుమీదున్నా రత్నమే. రామానికే తెలివి తేటలుంటే రెసిడెన్షియల్ స్కూలక్కర లేదు. ఎక్కడ చదివినా మంచి మార్కులే వొస్తాయి. బంగారం మంచిదవాలి కానీ కంసాలి చేతిలో ఏముంది? అదీకాక..., వాతావరణం వల్ల మనిషి తాలూకు ఐ. క్యూ. (ఇంటలిజెన్స్ కోషంట్) రెండు పాయింట్లు కంటె పెరగడం కాని తరగడం కాని జరగదని తేల్చారుట యీ మధ్యనే సైంటిస్టులు. నిజమే అయి వుంటుంది. అందుచేత- రామాన్ని రెసిడెన్షియల్ స్కూలుకి పంపలేక పోయినందుకు తనేమీ చింతించెయ్య నక్కర్లేదు. అక్కడ షైనయ్యేవాడు ఎక్కడేనా షైనవుతాడు. నక్క ఒక చోట ఊళ వేసి మరో చోట గౌరిమంగళం పాడుతుందా? కోకిల- కూయాలేగాని మధురాతి మధురమే కదా.... అని మనసుని మభ్యపెట్టు కున్నాడు పాపారావు. కనుక - రామారావు మామూలు బడికే వెడుతున్నాడు.

ఎంకటేసు - బతుకు బడిలోనే పాఠాలు అభ్యసిస్తున్నాడు. ఉదయం - తండ్రి బండి పట్టుకుని ఊరి మీదకి బయల్దేరుతాడు. తల్లి చీకటితోనే యిల్లొదిలేస్తుంది, ఎవరిళ్లల్లోనో పనులు చెయ్యడానికి. ఎంకటేసు- తండ్రి వెనకే బయల్దేరతాడు రోడ్డు మీదకి. పుల్లలూ కాగితాలూ ఏరుకుంటాడు. ఎండు పుల్లల్ని పొయ్యి పక్క పడేస్తాడు. చిత్తు కాగితాలని సాపు చేసి ఒక మూల జాగ్రత్త పెడతాడు. చీకటిపడి.... తల్లి యింత గంజీ అన్నమూ తినిపించాక- బుడ్డి దీపం ముందు కాగితా లేసుకుని.... అంటింపు ముద్ద పెట్టుకుని (అన్నం మెతుకులు గంజి కలిపి వేడి మీద పిసికితే తయారయ్యే జిగురు).... కాగితాలను కత్తిరించి- సంచిలు తయారు చేయడం మొద లెడతాడు. కాగితాన్ని బట్టి కాగితపు సంచి. పాతికో యాభయ్యో అయ్యాక అయ్య చేతికిస్తాడు. సింహాచలం - వాడి చేతిలో పదిపైసలు పెట్టి బిళ్లలు కొనేసుకో మంటాడు ఉదారంగా. ఆ కాగితపు సంచిలు షాహుకారు కమ్మి వొచ్చిన డబ్బులొత్తాగేస్తాడు. ఈ మధ్య నుంచి సింహాచలానికి బతుకంటే విసుగే వేస్తూంది. ఎంకటేసు తరవాత మరో యిద్దర్ని పుట్టించాడు. దానితో- గుడిసె మరీ యిరుకయి పోయింది. ఎలకల బోనులా తయారయింది- బిలబిలమంటూ పిల్లలతో. రాత్రి నిద్రయినా పోనీకుండా- యిలా కంటిమీద కునుకు పడితే చాలు- కంయి కుంయి మంటూ కుక్క పిల్లలు మొరిగినట్లు ఏడుపులతో లేస్తారు. అంతే.... యిక నిద్దర పట్టదు. తెల్లార్లూ జాగారమే. ఎంత వొళ్ళు ఏడెక్కిపోతున్నా రావులమ్మని దగ్గరకి తీసుకుందు కుండదు. అదేం మాయరోగమో.... రాత్రి వేళే లేచి ఏడుపు లంకించు కుంటారు గుంట ముండలు. ఎదవది.... ఆళ్లని కనడం తప్పయి పోయింది.

ఆ ఆలోచనకి - సింహాచలానికే నవ్వొచ్చేసింది. తను కావాలని కన్నాడా ఏటి? ఆళ్ళు పుట్టుకొచ్చేశారు. దేవుడు పిల్లల్నిస్తానో అనేస్తూంటే వొద్దన్నానికి తనెవడు? తనిష్ట మేమిటి? వాన రాకటా, సంతానం పుట్టడమూ మన్చేతిలో ఏముంది?

పోన్లే.... ఎలా జరిగే దలా జరుగుతుంది. మనిషేటి చెయ్యగల్డు? ఆ మాటకొస్తే కొంతలో కొంత నయమే. ఎంకటేసు మగ గుంటడు. కొంచెం- చేతి కందొస్తున్నాడు. పుల్లా పుడకా ఏరుకు రావడ మేమిటి, కాగితమ్ముక్కలు తెచ్చి సంచిలు తయారు చేయడ మేంటి.... అది వయసు కాదు సంపాదిస్తున్నాడు. దేవుడు సల్లగా జూసి- మరెండు మూడేళ్ళుపోతే.... (ఇంకాఉంది)

విచిత్ర యదార్థ గాథలు

# ఎగిరే క్రైస్తవ అర్చకుడు

ఇటలీలో జోసెఫ్ దేసా అనే క్రైస్తవ అర్చకుడు గాలిలో ఎగురుతూండగా అనేక సుప్రసిద్ధ వ్యక్తులు చూసినట్టు చరిత్రలో దాఖలాలు ఉన్నాయి. అతడు ఇటలీలో కాపర్టినో అనే ఊళ్ళో క్రీ. శ. 1603లో జన్మించాడు అతడి ఈ అద్భుత శక్తి గురించి తెలుసుకుని అప్పటి పోప్ జూలై 10,1657 తేదిన అతణ్ని ఒసిమో మఠానికి పిలిపించాడు. అక్కడ జోసెఫ్ నేల నుంచి నాలుగు అడుగుల ఎత్తు ఎగిరి ముప్పై అడుగుల ఎత్తునున్న బాదం చెట్టుపై వాలాడు.

మరొకసారి జోసెఫ్ చర్చి మధ్య నుంచి పక్షిలా ఎగిరి నలభై గజాల దూరంలో నున్న ఎత్తైన వేదికపై కూర్చున్నాడు. అలాగే మరొకసారి భక్తి పారవశ్యంలో గాలిలో లేచి ఒలీవ్ చెట్టుపై వాలాడు. అక్కడ ఒక రెమ్మపై అరగంట సేపు కూర్చున్నాడు నిచ్చెన తెచ్చి అతణ్ని క్రిందకు దింప వలసి వచ్చింది

జోసెఫ్ దేసా ఎగురుతూండగా చూసిన వాళ్ళలో పదమూడవ పోప్ అర్బన్, సేవాయ్ రాకుమారి మేరి కార్డినల్ ఫాక్చినెట్టి, కాస్టైల్‌కు చెందిన గ్రేట్ ఎడ్మిరల్, పేరు మోసిన డాక్టర్లు, సర్జన్లు, అనేక ఇతర ప్రముఖులు ఉన్నారు అతడి ఖ్యాతి విదేశాలకు కూడ వ్యాపించింది. స్పెన్ రాయబారి, అతడి భార్య అసిసికి వచ్చి జోసెఫ్ ఎగురుతూండగా తిలకించారు.

స్పెన్ రాయబారి తన అనుభవాన్ని ఈ విధంగా వివరించాడు. "మేము సాక్రెడ్ కాన్వెంట్ చర్చిలో ప్రవేశించగానే జోసెఫ్ మా తలలపై నుంచి ఎగురుతూ 12 గజాల దూరంలో ఉన్న ఒక శిలావిగ్రహంపై వాలి అక్కడ కొద్దిసేపు ప్రార్థన చేసి, బిగ్గరగా అరిచి, మరల ఎగిరి నేలపై వాలాడు ' రాయబారి భార్య మాత్రం ఈ సాము ను చూసి తెలివి తప్పింది. ఆమెకు ఔషధుల వాసన చూపించి తెలివి తెప్పించ వలసి వచ్చింది.

జోసెఫ్ బాల్యంలో జోళ్ళు కుట్టేపని నేర్చుకునే వాడు కాని పది హేడేళ్ళ వయస్సులో కాపుచిన్ మఠంలో శిక్షణార్థిగా చేర్చాడు. అతడి అయోగ్యతను చూసి అతన్ని మఠంనుంచి వెలి వేశారు ఐతే అతని అమితభక్తి, శ్రద్ధలతో ప్రభావితులయి, మరొక మఠాధిపతులు అతన్ని తమ మఠంలో చేర్చుకున్నారు. జోసఫ్ మందమతి ఐనా శిక్షణ పూర్తి అయాక అతన్ని అర్చకుడిగా నియమించారు. అప్పుడే అతడు ఎగరడం మొదలెట్టి ఇటలీలో సంచలనం సృష్టించాడు.

నేపల్స్‌లో మఠాధికార్లకు జోసెఫ్ ఉడ్డీన విన్యాసాలు మత వ్యతిరేకంగా కనిపించాయి. వారు అతణ్ని విచారణకు పిలిచారు. అసత్య మహాత్మ్యాల ప్రదర్శనలు చేసి ప్రజలను మోసగించాడని అతడిపై ...పోయాయి ఐతే అతని అద్భుతాల వెనుక ఏమి మోసం ఉంటేగా! అతణ్ని విడిచి పెట్టవలసి వచ్చింది. అప్పటికి మఠాధికార్లు జోసెఫ్‌ని ఈ 'ప్రదర్శనల అపకీర్తి 'నుంచి కాపాడడానికి 1639లో అసిసికి బదిలీ చేశారు. ఐతే అక్కడ కూడా అతడి ఉత్పతన లీలలు చూడడానికి ప్రజలు పోగవసాగారు అతణ్ని ఈ సారి పియెట్రా రుబ్బియాకి బదిలీ చేశారు కాని అక్కడ కూడా అతడు ఎగిరే అర్చకుడిగా ప్రసిద్ధి పొందసాగాడు అతడి ప్రార్థనా సభల్లో దైవ ప్రార్థనకు మోకరిల్ల డానికి కూడా చోటు లేకుండా జనం గుమి కూడేవారు.

పోప్ అతణ్ని మరొకసారి ఫొసొమ్ బ్రోన్‌లో గల కాపుచిన్ గృహానికి బదిలీ చేశాడు. ఐతే అక్కడ కూడా అతడు ఉడ్డీన లీలలు కొనసాగడంతో అతణ్ని



ఓసిమో పట్టణానికి బదిలీ చేశారు. అక్కడ అతడు సెప్టెంబరు 18,1663 తేదిన పరమ పదించాడు.

జోసెఫ్ కనీసం నూరు సార్లైనా ఎగిరి ఉంటాడని నమ్మకమైన సాక్షులు రాసి పెట్టారు అతడు మొదటి సారిగా 1627లో క్రిస్మస్ ముందు రాత్రి గ్రొటిల్లా చర్చిలో ఎగిరాడు గొర్రెకాపర్లు చర్చిలో పైపులు వాయిస్తూ ఉండగా అతడు భక్త్యావేశంతో ఒక కేక పెట్టి చర్చి మధ్యలో 120 అడుగుల మేర ఎగిరి ఎత్తైన వేదికపై వాలాడు అక్కడ 15 నిముషాలు ఉండి క్రిందకు దిగాడు. అతడు ఫొసొమ్ బ్రాన్‌లో ఒక గొర్రెపిల్లని భుజాన ఎత్తుకుని చెట్ల చివర వరకు ఎగిరాడు. అక్కడ భక్తితో రెండు గంటలసేపు మోకరిల్లి ఉన్నాడు. పలుసార్లు అతడు తన తోటి అర్చకుడిని పట్టుకుని గాలిలోకి లేచాడు. అసిసిలో బాల్తాసార్ రోసి అనే మానసిక రోగిని రోగ నివారణ-కోసం జోసెఫ్ ముందుకు తీసుకొని రాగా అతడు రోసి జుత్తు పట్టుకుని, కేకవేసి రోసితో సహా గాలిలోకి లేచి 15 నిముషాలు ఉండి నేలపై దిగాడు ఐతే రోసి రోగవిముక్తి పొందింది లేంది తెలియదు.

జోసెఫ్ గాలిలో అరగంట వరకు మోకరిల్లి ఉండేవాడని చూసిన వారు పేర్కొన్నారు మత సమావేశాల్లో అతడు గాలిలోకి లేచి పోవడం వలన సమావేశానికి అంతరాయం కలిగేది కాబట్టి అతణ్ని ముఖ్య మత సభల్లో, వేడుకల్లో పాల్గొన నిచ్చేవారుకాదు. చిత్రమేమిటంటే చనిపోతూ కూడా జోసెఫ్ గాలిలోకి లేచాడు. ఫ్రాన్సెస్కో పియర్ పావలీ అనే శస్త్ర చికిత్సకుడు, గియాన్సింటో కారాసి అనే డాక్టరు అతడు చనిపోయేముందు చికిత్స చేస్తూ అతడు గాలిలోకి లేవడం గమనించారు పియర్ పావలీ ఈ విధంగా పేర్కొన్నాడు "జోసెఫ్ కుర్చీ నుంచి బెత్తెడు ఎత్తు లేవడం నేను గమనించాను అతణ్ని కూర్చో బెట్టడానికి ప్రయత్నించా కాని లాభం లేకపోయింది. నేనూ, డా. కారాసి మోకరిల్లి పరికించగా అతడు నిశ్చయంగా గాలిలో తేలుతున్నట్టు తెలుసుకున్నాం అతడి పై మఠాధికారి అతణ్ని సామాన్యం కమ్మని ఆదేశించగా అతడు నెమ్మదిగా కుర్చీలో కూలబడ్డాడు." జోసెఫ్ ఉత్పతన లీలలను. అతడి జీవిత కాలంలోనే చూసినవారు రాసి పెట్టి ఉంచారు. ఐతే అతడు ఎలా ఎగురగలిగేవాడో ఎక్కడా సంజాయిషి లేదు.

–పులిగడ్డ విశ్వనాథరావు

# వ్యక్తిగతం



శ్రీ ఏ. బి. కదం మహారాష్ట్ర శాసన సభ్యులలో ఒకరు. ఒక వివాహిత యువతిని వేధించారన్న కారణంగా ఈ మధ్యనే ఈయనని ఢిల్లీలో జనం కొట్టి చంపివేసారు... □



అజ్మల్‌ఖాన్ గౌహర్ అంతర్జాతీయ బాలల శాంతి అవార్డుని అందుకుని ఈమధ్యే అమెరికా సంయుక్త రాష్ట్రాల నించి తిరిగి వచ్చాడు. ఇతని వయసు 11 సంవత్సరాలు. బళ్ళారిలోని గిరిష్ ప్రసాద్ మెమోరియల్ స్కూలులో 7వ తరగతి చదువుతున్నాడు. సంఘసేవ అంటే ఇతనికి ఎంతో ఇష్టం. కొంత కాలం కిందట క్షయరోగులతో కలిసి సేవ చేస్తుండగా ఇతనికి ఆ జబ్బు దాదాపు సోకినంత పనైంది. గౌహర్ సేవలకి గుర్తింపుగా 1981 లో బళ్ళారి జిల్లా టి. బి. సంస్థ అతనికి ఒక పతకాన్ని బహూకరించింది. 1983 లో ఇతను ధైర్యసాహసాలు ప్రదర్శించిన బాలలకి ఇచ్చే జాతీయ అవార్డుని అందుకున్నాడు. ఈ సంవత్సరారంభంలో నేషనల్ క్లబ్ స్కౌట్ గాలంట్రీ అవార్డుని రాష్ట్రపతి నించి స్వీకరించాడు. ఇప్పుడు అమెరికాలోని ఇంటర్ నేషనల్ రౌండ్ టేబిల్ ఏస్ ఫౌండేషన్ వారి అంతర్జాతీయ అవార్డు గ్రహీత అయినాడు... □



నికరాగువా విదేశీ సంబంధాల మంత్రి డాక్టర్ మిగ్వెల్ డ ఎస్‌కోటో బ్రోక్‌మన్ అధికార పర్యటన నిమిత్తం ఇటీవల భారతదేశం వచ్చారు. ఆ సందర్భంగా ఆయన ఒక శుక్రవారం నాడు మహాత్మాగాంధీ పట్ల గౌరవ సూచకంగా కొత్తఢిల్లీలోని రాజ్‌ఘాట్ వద్ద ఒకరోజు ఉపవాసం చేసారు!.... □

# వారఫలం

**27-12-1985 శుక్రవారం మొదలు**
**2-1-1986 గురువారం వరకు**

★ **మేషం :** మాటకు యింతవరకు ఎదురు చెప్పేవారుండరు. ఇప్పుడిప్పుడు ఎదురాడేవారున్నట్లు గ్రహిస్తారు. ఉన్నత విద్యార్జనకు ప్రాకులాడే వారికి అనుకూలం. పత్రికా వ్యాసంగాన చాకచక్యమున్న వారికి మేలు. స్త్రీలకు: మంచి పేరు, మంచి అర్జన, ఉద్యోగమందు పెంపు.

★ **వృషభం :** మీకు అనుకూలంగా గ్రహ మండలాన చెప్పదగిన మార్పులొచ్చాయి. అందుచేత 'పట్టినది బంగారమే'. చాలామంది నూతన వ్యాపార యత్నాలుచేయనున్నారు. కొందరు స్థిరాస్తి పెంపునందు, యిల్లు కట్టుటయందు నిమగ్నులు కాగలరు. స్త్రీలకు: ఏనాడో అనుకొన్న నగల తయారీ యిప్పటికి ముగుస్తుంది.

★ **మిథునం :** కృషి రాణించుట చేత, రావలసిన డబ్బు అందటంచేత, సంతోషం బాగా వెల్లి విరుస్తుంది. ఇంట సాధు సజ్జన గోష్ఠి ఏర్పాటుగావించి, యింటిల్లిపాది ఆనందిస్తారు. ఒకానొక విషయంలో చెలరేగిన వాదమందు మీదే పైచేయి. స్త్రీలకు: ఆదాయం, వ్యవహారానుకూలం, బంధు గోష్ఠి, ఇత్యాదులతో వారం గడుస్తుంది.

★ **కర్కాటకం :** 'ఎప్పుడూ యిలాగే ఉంటుందిలే' అని అనుకోరాదు. బాగా అనుకూల వారం. అనుకూల గ్రహ మార్పులు సంభవించిన కాలం. వ్యాపారం బాగా పతాక స్థాయినందుకోగల సమయం. వృత్తియందు మెరుగు కనిపించగల సమయం. స్త్రీలకు: దూర భారాలకు పోగల పరిస్థితులు, శుభ కార్యాలందు సౌఖ్యం కలుగజేసుకోవలసిన అవకాశాలు.

★ **సింహం :** ఉద్యోగపు పెంపునకు మీరు గావించిన యత్నాలు సఫలమవుతాయి. వైద్యం నిమిత్తం పాటుపడేవారికి కొంత ఊరట కలుగగల సమయం. ప్రయాణాలయందు చాలమందికి జాగ్రత్త అవసరమని, చెప్పవలసిన ముఖ్యాంశం. స్త్రీలకు : బ్యాంకులందు, భారీ వ్యాపారమందు పనిచేసే వారికి అనుకూలం.

★ **కన్య :** శుభము జరుగుటను గూర్చి, ముఖ్యంగా, కొడుకు, కూతుళ్ల వివాహాలను గూర్చి కృషి చేయవలసిన సమయం. వృత్తియందు కొంత ప్రకాశం లేకపోలేదు. ఒకానొక ఘనకార్యం చేపట్టి సాధన చేసికోగలగటం మీకే ఆశ్చర్య జనకం. స్త్రీలకు . నూతన ఉద్యోగ కృషి సఫలం. కొందరకు వాహన సౌకర్యం.

★ **తుల :** ఇంటగాని బయటగాని మీ నైజగుణమైన అధికారం చెలాయింపు మానుకోండి. ఏరుగుట విరుగట కొరకే కొన్ని వ్యవహారాలలో మీరు మరీ పెచ్చు పెరిగిపోతారు. రాజ్యాంగ వ్యవహారదక్షులు మరీ జాగ్రత్తగా చరించవలసిన కాలం. స్త్రీలకు: ఇరుగుపొరుగు తగాదాలు, ధననష్టం.

★ **వృశ్చికం :** గ్రహానుకూలత లేదని ఊరకుండటం కూడా ఏమంత మంచి పనికాదు. గ్రామాంతరం పోవడం కూడా కొందరకు ఈ వారం తగదు. కాలం అనుకూలమైనపుడు ప్రయాణం చేయటం న్యాయం. విరోధులున్నారు. ఒక కంట కనిపెట్టుట శ్రేయం. స్త్రీలకు: ప్రభుత్వోద్యోగం చేసేవారు బహు జాగ్రత్తగా సంచరించదగిన వారం.

★ **ధనుస్సు :** గత కొన్ని వారాలకన్నా అన్ని రంగాలలో మీకు అనుకూలత, పేరుప్రతిష్ఠలు, ఒకవేళ ధనాదాయంలాంటి అనుకూలతలు సంభవం. పదిమందిచే గౌరవింపబడటం కూడా వార విశేషమే. విద్యార్థులకు చక్కని అవకాశాలు లభ్యంకాగలవు. స్త్రీలకు: సుఖశాంతులు, నగలు కొనగల అవకాశాలుంటాయి.

★ **మకరం :** ఏదో జరుగుతూ ఉన్నదిలే, కాలం ఆగదు కదా! అనుకొని నిరుత్సాహంగా ఉండవలసిన వారంగాదు. మీ రాశికి అనుకూల గ్రహాలు సర్వసంపదలు చేకూర్చగల సమయం. ఉద్యోగం లేనివారు ఉద్యోగం సంపాదించుకోగలరు. ఇల్లు లేనివారు, యిల్లు కట్టే ప్రయత్నాలు చేసికోగలరు. 'శని' గ్రహానుకూలతగల వారం. స్త్రీలకు: సర్వత్రా అనుకూలమే.

★ **కుంభం :** నూతనాంశాలు గ్రహిస్తారు. క్రొత్త బంధుత్వమునకు తాపత్రయ పడతారు, కొందరా కృషియందు అభీష్టసిద్ధి నందుకోగలరు. ఎంతో కాలంగా చేతికి అందని డబ్బు అందటం గమనింపదగిన అంశం. స్థితియందు పెంపు కనిపిస్తుంది. స్త్రీలకు: ప్రయాణములందు యిబ్బంది, చుట్టుప్రక్కల తగాదా తంటాలతో కొందరు సతమతం కావటం గమనిస్తారు.

★ **మీనం :** ఎంతో పని పడితేగాని ప్రయాణించటం శ్రేయస్కరంకాదు. కొందరకు ప్రమాద సూచిత వారం. వృత్తియందు పెంపు కనిపిస్తుంది. రాక మొండికెత్తిన మీ డబ్బు తిన్నగా అందనున్నది. కృషి లోపం చేయకండి. ఇకనుండి మంచి రోజులు రాగలవనే ఆశ చిగురుస్తుంది. గ్రహించండి. స్త్రీలకు: వృత్తిరీత్యా ఆనందం, ధనాదాయం, పదిమందిలో ప్రతిష్ఠాకరమైన వారం.

—విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# సాంప్రదాయకమైన గులాబ్ జామూన్లవంటి పిండివంట చేయుటకు గంటలతరబడి అవశ్యం





## "రుచితో ఇప్పుడు నిమిషాలలో ఇది సాధ్యం"

రుచి గులాబ్ జామూన్ మిక్స్ ఆనందాన్ని చిందించే శ్రేష్ఠమైన సాంప్రదాయకపు నోరూరించే రుచులను గుభాళించుతూ నిమిషాలలో ఒనగూర్చగలదు. తూకం తూయవలసింది లేదు. కొలత చూడవలసింది లేదు. కాచుకూర్చోవలసిందీ లేదు. ప్రత్యేకమైన ముడి వస్తువుల కలయికలతో ప్రతి ఒక్క రుచి గులాబ్ జామూన్ మిక్స్ తయారు చేయబడింది. ప్యాకెట్టును విప్పటమే తరువాయి, మీరు యిష్టపడి కోరుకొనే - రసభరితమైన, రుచులూరించే, బంగారు వర్ణపు గోధుమ రంగు గులాబ్ జామూన్లను తయారు చేయ మీరు సన్నద్ధంగావచ్చు. అవి క్షణికంలో మీ నోటిలో కరిగిపోగలవు!




ఇప్పుడు దొరుకుతోంది :
రుచివారి క్రొత్త
బొంబే
హల్వా మిక్స్




**రుచి గులాబ్ జామూన్ మిక్స్**

విదేశీ కొనుగోలుదారులనుండి ఎంక్వయిరీలు కోరబడుతున్నాయి.

9360 T G

సీరియల్







# ప్రతిభ

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్

(గత సంచిక తరువాయి)

ప్రతిభా! నీకు తెలియని విషయమేమి కాదు. నీవు అవివాహితవు. డ్యాన్స్ స్కూలు కూడ నిర్వహిస్తున్నావు సమాజంలో ఈనాడు నాట్య విద్యాలయాల మీద సదభిప్రాయం లేదు. అందుకు కొన్ని కారణాలు ఉన్నాయి పాశ్చాత్య సంస్కృతితో పాటు అరంగేట్రాల ఆండాళ్ లాంటి వారి ప్రవర్తన గూడ ఈ అపఖ్యాతికి దోహదం చేసింది నీవు ఒక దైవాంశ సంభూతురాలివి. నా నృత్య రూపకాలు నీవు ప్రదర్శించడం నా అదృష్టం. నీలో నేను ఈశ్వరాంశను చూశాను. కాని సమాజం ఈ భావాన్ని అర్థం చేసుకోవడం చాల కష్టం. ఆండాళ్ వంట వారు తమ ప్రవర్తనకు తగినట్లుగానే ప్రవర్తించారు. ఈ గందరగోళంలో అనవసరంగా నీవు అల్లరి పాలు గావడం నా కిష్టం లేకపోయింది. అటు మనశ్శాంతిని వెతుక్కుంటూ ఇటు పుణ్యమూ, పురుషార్థమూ సాధిస్తూ కొంత కాలంగా దక్షిణ దేశ యాత్ర చేస్తున్నాను. నేను హైదరాబాదు నుండి నిష్క్రమించి నందువల్ల ఎవరికి ఏవిధమైన నష్టమూ జరగదు అక్కడున్న ముప్పై లక్షల జనాభాలో ఒక వ్యక్తి ఎక్కడికి పోతే ఎవడికి కావాలి ఇకపోతే నాకో కుమార్తె ఉన్నదన్న విషయం నీ కకస్మాత్తుగా తెలిసింది. దానిని గురించి నేనిపుడు ఏమి చెప్పేందుకు సిద్ధంగా లేను. సమయం వచ్చినపుడు పూర్తి వివరాలు నీకే తెలుస్తాయి. ఇకపోతే ఆమెను గురుపాదస్వామి వద్ద శిష్యురాలిగా ప్రవేశపెట్టడం కూడ ప్రత్యేకమైన పథకంతో చేసిన పనే. నీకు గురుపాదస్వామికి మధ్య సదభిప్రాయం లేదనే విషయం నాకు తెలిసింది. అయితే ఈ కళానుబంధం ఆ రాగద్వేషాలకు అతీతంగానే పరిణమిస్తుందని నీవు గ్రహించుట మంచిది."

ప్రతిభ కొన్ని క్షణాలు ఏమి మాట్లాడ లేదు. తర్వాత మెల్లిగా అన్నది. "అభినయంలో జావళీలు మొదలైన శృంగార పదాలు ఉంటాయి. వాటిని నాట్యం చేస్తున్నపుడు ప్రేక్షకులతో పాటు అభినేత్రిలో కూడ ఆ రసభావన కలగడం సహజం. వేద మంత్రాలకు అభినయం ప్రారంభించినప్పటి నుండి నాలో ఏదో మహత్తరమైన పరివర్తనం ప్రారంభమైంది. ఈ ఆస్తులు, అంతస్తులు, సన్మానాలు చప్పట్లు శాశ్వతాలు కావన్నభావం క్షణ క్షణానికి నాకు గుర్తుకు వస్తుంది ఐహికమైన సుఖభోగాల మీద ముఖ్యంగా ధనం మీద అభిలాష తగ్గిపోతున్నది. అయితే కామికానిదే మోక్షగామి కాలేడన్నట్లు వైవాహిక జీవితానుభవం లేకుండా ఒక్కసారి చివరి పురుషార్థానికి పోవాలను కోవడం అవివేకమేమో మరి. ఒక్క పెళ్ళి చేసుకోవాలనే కోరిక తప్ప మిగిలిన రాగద్వేషా లన్నింటిని క్రమంగా జయించడానికి ప్రయత్నిస్తున్నాను. మీరనుకొన్నట్లు నా కిప్పుడు గురుపాదస్వామి మీద ఏవిధమైన కోపమూ లేదు ప్రతీకార వాంఛ లేదు. సుధారాణి విదేశాలకు వెళ్ళి గురుపాదస్వామి సంస్థలకు పోటీగా భరత నాట్య కేంద్రాలు ప్రారంభించడం మొదట్లో నా ప్రోత్సాహంతోనే జరిగినప్పటికి ఇవ్వాళ నే నందుకు విచారిస్తున్నాను. కవిగారూ! ఏది ఎప్పుడు ఎలా జరగాలో అలా జరుగుతుంది. కవిగారూ! నాట్యానికే గాదు. మానవ జీవితానికి ప్రతి ఇతివృత్తానికి ఒక లయాన్వితమైన గమనం ఉంటుంది వీటన్నింటి పర్యవసానం ఎలా వుంటుందో చూద్దాం."

"ప్రతిభా! నీవు మరికొన్ని క్షేత్రాలు దర్శించ దలుచుకుంటే దర్శించు. కాని నిన్ను దర్శించి తరించాలనుకునే ప్రేక్షకులను మాత్రం మరిచి పోవద్దు. సాధ్యమైనంత త్వరగా హైదరాబాదు వెళ్ళడం మంచిది"

జరిగినకథ –20 : భవభూతి గిరిజకు గురుపాదస్వామి దగ్గర నాట్యం చెప్పించాలనుకుంటాడు. గురుపాదస్వామి అందుకు అంగీకరించాడు. గురుపాదస్వామి వలన ప్రతిభకు ఒక సోదరి ఉందని భవభూతి తెలుసుకుంటాడు. గురుపాదస్వామి గిరిజ పేరును నీరజగా మార్చాడు. నాట్యామృతం అనే 'డాన్స్ థెరఫీ' పుస్తకం వాత్స్యాయనశర్మ ద్వారా భవభూతి ప్రతిభకి పంపిస్తాడు తనకు నీరజ అనే పుత్రిక ఉన్నట్లు భవభూతి చెప్పలేదని ప్రతిభ నిష్ఠూరం ఆడుతుంది. పోలియో వల్ల అవిటిదైన ఆశాలత మీద నాట్యామృతాన్ని ప్రయోగించింది ప్రతిభ. ఆశాలత సంపూర్ణ ఆరోగ్యవంతురాలయింది. ఈ వార్త భవభూతికి చెప్పాలని కబురు చేస్తే అతను నగరంలో లేడని సమాచారం అందింది. ఆండాళ్ తనపై వేసిన నిందలకు కృంగిపోయిన ప్రతిభ ఆయా యాదమ్మను తీసుకుని యాత్రలకు వెళుతుంది. కాళహస్తిలో వారికి భవభూతి కనబడతాడు. విలువైన 'నాట్యామృతం' ప్రతిని ఎవరో కాజేసినట్లు భవభూతి ప్రతిభకి చెపుతాడు.

## 16

విజయవాడ వద్ద తెనాలి సమీపంలో కూచిపూడి అని ఓ గ్రామం ఉంది. అందులో సుమారు మూడు వందల సం. లకు పూర్వం సిద్ధప్ప అని ఒకాయన జన్మించాడు. అతడు పెద్దగా చదువుకున్నవాడు గాడు. పెళ్ళి కూడ అయింది. తనకు చదువు రాలేదని నలుగురు చేసే అవమానాన్ని భరించలేక సిద్ధప్ప కాశీ వెళ్ళి పన్నెండు సం. రాలు కఠోర దీక్షతో విద్య నభ్యసించి పండితుడై తిరిగి తన గ్రామానికి వచ్చాడు. అతడు వచ్చే సమయానికి కృష్ణానదికి వరదలు వచ్చి పొంగుతున్నది. అయినా సాహసించి నదిలోకి దిగి అవతలి ఒడ్డు చేరుకోవాలని ప్రయత్నించాడు. కాని ఫలించలేదు. ప్రవాహ వేగానికతడు కొట్టుకొని పోతున్నాడు. మరణం తప్పదని భావించిన సిద్ధప్ప అక్కడికక్కడే మానసిక సన్యాసం స్వీకరించాడు. మరుక్షణమే నదిలో మునిగిపోయాడు. కాని మానవ చరిత్ర మరో రకంగా మలుపు తిరగవలసిన స్థితి వుంది. సిద్ధప్పను కెరటాలు ఒక

ఒడ్డుకు నెట్టి వేశాయి. మర్నాడు సజీవుడైన సిద్ధప్ప తన గ్రామం ఎక్కడ వుందో వెతుక్కుంటూ వెళ్ళాడు. భార్యతో సహా బంధుజనులు, ఊళ్ళో వారందరు సిద్ధప్పను చూచి సంతోషించారు కాని ప్రయోజనం ఏం వుంది అప్పటికే అతడు సన్యాస ఐహిక బంధాలకతీతుడు తన శేషజీవితాన్ని భగవదారాధనకు అంకితం చేశాడు ఈశ్వరారాధనకు ఎన్నో మార్గాలున్నాయి అందులో నాట్యం ఒక ఉత్తమమైన సేవ. సిద్ధేంద్రముని జీవాత్మ పరమాత్మల విరహాన్ని, తిరిగి సంయోగాన్ని సూచించే ఒక నృత్య రూపకాన్ని రచించాడు దాని పేరే భామాకలాపం. ఇది సత్యభామ శ్రీకృష్ణుల మధ్య జరిగే ఒక విచిత్ర కథా కలాపం. ఇందులో, సత్యభామ జీవాత్మకు సకేతం స్త్రీ పాత్రలు కూడ పురుషులే అనువంశికంగా అభినయించే పద్ధతి సిద్ధేంద్రముని ఏర్పాటు చేశాడు. ఇదేదో కాలక్షేప ప్రదర్శన కాదు ఉపనీతుడైన ప్రతి వటువు తప్పనిసరిగా ముక్కులు చెవులు కుట్టించుకొని భక్తి భావంతో భామాకలాపాన్ని అభినయించి తీరాలి. ఇదొక వ్రతం. ఈ విధంగా సిద్ధేంద్రముని చేత ప్రారంభింపబడిన కూచిపూడి భామాకలాప ప్రక్రియ త్వరలోనే ఆంధ్రదేశమంతటా విఖ్యాతమైంది అత్యంత నిష్ఠతో కూచిపూడి బ్రాహ్మణులు ఈ ప్రక్రియను ఆరాధించడం మొదలు పెట్టారు విజయనగర ప్రభువైన వీర నరసింగరాయలు రాయలసీమలోని సిద్ధవటాన్ని కూచిపూడి నర్తకులకు అగ్రహారంగా ఇచ్చాడు. అలాగే గోల్కొండ నవాబు అబుల్ హసన్ తానీషా కూచిపూడి భామాకలాపాన్ని ఆదరించాడు. అచ్యుత దేవరాయలు తమిళనాడులోని "మెలటూరు" ప్రాంతాన్ని వీరికి అగ్రహారంగా ఇచ్చాడు. అక్కడ స్థిరపడిపోయిన వారిని మెలటూరు భాగవతులు అంటారు. అచ్యుతదేవరాయల పేరు మీద ఈ అగ్రహారం, నాటి నుండి, అచ్యుతాపురం అనే పేరు వచ్చింది బనగానపల్లి నవాబులు కపత్రాల అనే గ్రామాన్ని కూచిపూడి భాగవతులకు దానం చేశారు ఈ విధంగా కూచిపూడి సంప్రదాయం దేశమంతా ప్రాకింది. పూర్వం వీరు యక్షగానాలు మాత్రమే ప్రదర్శిస్తుండేవారు. భామాకలాపం, గొల్లకలాపం కూడ ప్రదర్శించడం కద్దు తర్వాతి కాలంలో తరంగాలు, పదాలు, వర్ణాలు, శబ్దాలు, పళ్ళెంపైనృత్యం కూడ ప్రదర్శిస్తున్నారు. ఇవి సిద్ధేంద్రముని నాటి నుండే వున్నాయని చెప్పడం కష్టం కూచిపూడి. భరతనాట్యానికి కొంత సన్నిహితంగా ఉన్నట్లే కన్పడ్డా తనదైన ఒక ప్రత్యేక బాణీని రూపొందించుకున్నది. ముఖ్యంగా అభినయంలో నాటకీయత కూచిపూడి వారి ప్రత్యేకత. ఇది పూర్వం భరత నాట్యంలో లేదు నాటకీయత అంటే నర్తకి వేదికపై తానే భిన్న భిన్న పాత్రలను అభినయిస్తూ ఒక రూపకాన్ని ప్రదర్శిస్తుంది ఇది తర్వాత కాలంలో భరత నాట్యంలో కూడ ప్రవేశించింది. కూచిపూడి బ్రాహ్మణులు గొప్ప మంత్ర శాస్త్రవేత్తలు. తరచు వీరికి తమ శాస్త్ర విద్యను ప్రదర్శించవలసిన అవసరం కలుగుతుండేది వీరంటే గిట్టని వారు వీరి ప్రదర్శన చెడగొట్టే నిమిత్తం వీరిపై మంత్ర ప్రయోగాలు చేస్తుండే వారు వెంటనే కూచిపూడి విద్వాంసులు ఆ ప్రయోగాన్ని తిప్పికొట్టేవారు. దీనికే జడ వేయడం అంటారు సత్యభామ పాత్ర ధారిణి వేదిక మీదికి రావడానికి ముందుగా ఒక తెరను కడ్తారు సత్యభామ తెరవెనుక నుండి తన జడను తెర మీదుగా ఆ ప్రేక్షకులను కనబడేలా వదులుతుంది అంటే అది కూచిపూడి వారు తమ



# ప్రతిభ

శత్రువులయిన మంత్ర శాస్త్రవేత్తల మీద చేసిన సవాలు అన్న మాట. అప్పుడు ప్రత్యర్థి వర్గం వారు తమ మంత్ర ప్రయోగాలు యథాశక్తి ప్రయోగించి ఈ ప్రదర్శనను చెడగొట్టాలని ప్రయత్నిస్తారు. దానిని కూచిపూడి మంత్ర శాస్త్రవేత్తలు ఎదుర్కొంటారు. ఇందులో విజయం సాధించిన పిమ్మటనే వారి ప్రదర్శన మొదలవుతుంది.

విజయవాడలో ప్రతిభ ప్రదర్శనాన్ని స్థానిక కళా సంస్థ వారొకరు ఏర్పాటు చేశారు. అది టిక్కెట్ల ప్రదర్శన. దాని మీద వచ్చిన లాభాలను వికలాంగుల సంక్షేమ నిధికి విరాళంగా ఇస్తామని ప్రకటించారు. 500, 200, 100 ఇలా టిక్కెట్లకు పెట్టి పెద్ద పెద్ద ధనవంతుల నుండి గుంటూరు, ఆ చుట్టుప్రక్కల నున్న ప్రత్తి, పొగాకు వ్యాపారస్తుల నుండి విరాళాలు వసూలు చేశారు. ప్రతిభ ఆశాలతకు "డ్యాన్స్ తెరపీ" తో వైద్యం చేసినప్పటి నుండి మానసికంగా ఒక యోగిని అయింది. వికలాంగుల సంక్షేమ నిధికి విరాళం కోసం ఈ ప్రదర్శన ఏర్పాటు చేసుకుంటున్నామని చెప్పగానే ఆమె సంతోషంతో అంగీకరించింది. ఆనాటి ప్రదర్శన భామాకలాపం. పత్రికల్లో ఈ ప్రదర్శనకు సంబంధించిన టిక్కెట్ల అమ్మకం వివరాలు ప్రకటన రూపంలో వెలువడ్డాయి. ఆండాళ్ అది చూచింది. వెంటనే ఆమె ఎవరికి చెప్పకుండా గుంటూరు వెళ్ళింది. అక్కడ అరండేల్‌పేట కవతల పిచ్చుకల గుంటలో అఘో రయ్య అనే ఒక మంత్ర శాస్త్రవేత్త ఉన్నాడు. అతడు ఆండాళ్‌కు లోగడ పరిచయమే. గుంటూరులోను, విజయవాడలోను లోగడ ఆండాళ్ ప్రదర్శనలు ఇచ్చినపుడు వాటికి అఘో రయ్య కూడ వచ్చాడు. అతడు చూడడానికి మామూలుగానే కనపడతాడు. కాని అర్ధరాత్రి వేళ శ్మశానంలో కూర్చుని వామాచారసాధన చేస్తూ వుంటాడు. భేతాళుడికి ఆవాహన చెప్పి ముగ్గులో మంత్రించిన అవాలు చల్లి మదిరా మాంసములు నైవేద్యం పెడుతుంటాడు. దీనివల్ల అతనికి చాల అద్భుత శక్తులు లభించినవనే తెలిసిన వారు చెప్పుకుంటారు. కొంతమంది మాత్రం ఇదంతా వట్టి అబద్ధమని జనులను వంచించి ధనం కాజేసే నాటకం అని అంటూ వుంటారు. ఎవరెన్ని మాటలు చెప్పినా రాత్రి వేళల్లో ఆయన వద్దకు రాజకీయవేత్తలు, ధనవంతులు వచ్చి తమ జాతకాలు చెప్పించుకుంటారు. అఘో రయ్య కూడ చిన్న చిన్న కేసులు పట్టుకోడు. అంతా పెద్దలతో కూడిన వ్యవహారమే. ఆండాళ్ వెళ్ళి అఘో రయ్యను




ఆశ్రయించింది. తనకు కావలసిందేమిటో ఆయనకు మనవి చేసుకుంది. అఘో రయ్య చిరునవ్వు నవ్వి ఆండాళ్ చెంప మీద చిటుక వేసి "అంతే గదా నీవిక నిర్భయంగా హైదరాబాదు వెళ్ళవచ్చు" అన్నాడు. ఆండాళ్ మూడవ కంటి వాడికి తెలియకుండా తిరిగి హైదరాబాదు వెళ్ళిపోయింది. గుంటూరులోని కొందరు ప్రముఖులతో పాటు అఘో రయ్యకు కూడ ప్రతిభ భామాకలాపం చూడడానికి ఫ్రీ పాసు వచ్చింది. అఘో రయ్య ఆ క్రితం రోజు రాత్రి శ్మశానానికి పోయి సాధన చేశాడు. మంత్రాలతో ముగ్గు వేసి దాని మీద నిమ్మకాయలు కోసి అవాలు చల్లి మద్యాన్ని మాంసాన్ని భైరవునికి నివేదన సమర్పించాడు.

ఛింది ఛింది భింది భింది మారయ మారయ ఉచ్చాలయ ఉచ్చాలయ అంటూ మంత్రాలు పఠించాడు. తెల్లవారు జామున ఇంటికి వచ్చి పడుకున్నాడు. మర్నాడు సాయంత్రం ప్రదర్శన వేళకు అఘో రయ్య విజయవాడ చేరాడు. ప్రదర్శన సాయంత్రం స్థానిక కళాక్షేత్రంలో ప్రారంభమైంది. ప్రతిభ సత్యభామగా అలంకరించుకొన్నది. ఆ వెనుక నట్టువాంగం వారు వచ్చారు. లోగడ ప్రదర్శనలకు వెళ్ళేప్పుడు తోడుగా సుధారాణి ఉండేది. ఇంకా చాల సం.ల క్రితం స్వయంగా గురుపాదస్వామియే వెంట వుండి ఆమె ప్రదర్శనకు నేతృత్వం వహించే వాడు. ఇటీవలి కొన్ని ప్రదర్శనలకు భవభూతి కూడ ఆమె వెంట వచ్చాడు. కాని ఈనాడు ఆమె వెంట వీరెవరూ లేరు. ఎవరూ లేరనే లోటును గూర్చి ఆమె ఆలోచిస్తున్నదో లేదో తెలియదు. కూచిపూడి సంప్రదాయం ప్రకారం ముందుగా బ్రాహ్మణులు రావడం మంగళాచరణం గావించడం, తర్వాత అవిఘ్నమస్తు అని వినాయకుడు రావడం ఇవన్ని నేటికీ ప్రదర్శిస్తూనే వున్నారు. తెరగట్టడం, తెర మీద జడ వేయడం ఇదంతా కూడ జరుగుతూనే వుంది. అయితే అది కేవలం అభినయంలో ఒక భాగమే కాని గురుపాదస్వామికి గాని అతని శిష్యులకు, శిష్యురాండ్రకు గాని మంత్ర శాస్త్రం తెలియదు. కేవలం సంప్రదాయకంగా దానిని అలా చూపుతూ వుంటారు అంతే. భామాకలాపంలో సత్యభామ పాత్ర ప్రవేశించి తానెవరో చెప్తుంది. "వినవమ్మా ఏమి చెబుదును. ఘనుడగు శ్రీకృష్ణుబాసి తాళగ లేకన్ పని బూని వెదక వచ్చితి అనువొందగ సత్యభామ యందురె నన్నున్" అని కందార్థ దరువులు పాడుతూ అభినయిస్తుంది. ఇక్కడ సత్యభామ వాసక సజ్జిక. భామనే సత్యభామనే భామనే పదియారు వేల కోమలూలందరిలోన భామనే సత్యభామనే అని తన స్వాధీన భర్తృక తత్వాన్ని అభినయిస్తుంది. సూత్రధారుడే మాధవి అనే చెలికత్తెగా వేదిక పైకి వచ్చి ఆయన పేరు ఊరు అన్నీ అడగతాడు. సిగ్గాయనో సిగ్గాయనోయమ్మ వాని పేరు దెల్ప అంటూ ప్రౌఢ అయిన సత్యభామ ముగ్ధత్వాన్ని అభినయిస్తుంది. మదనామదనా యంచు వదలలేక నీ మదిలో నించుచునే తాళలేనే నేతాళలేనే అందరిలోన నానాధుడేడే అనే దరువుతో విప్రలబ్ధ శృంగారాన్ని ప్రదర్శిస్తుంది. మాధవిని శ్రీకృష్ణుని వద్దకు రాయబారం పోయిరావే ఓ చెలియా అని చెప్తూ శకునాలు మంచివాయెనమ్మా అంటు విరహోత్కంఠితగా అభినయిస్తుంది. ప్రదర్శన అత్యద్భుతంగా సాగుతుంది. అటు ప్రేక్షకులతో పాటు రంగస్థలం మీద నర్తకి రసలోకంలో లీనమై పోయి భావతాదాత్మ్యం చెంది వున్నారు. ఉన్నట్టుండి దభీమని ఏదో శబ్దం పెద్దగా వినబడింది. పైనుండి రంగస్థలం మీద ఏదో పడింది. ఆ పడడం ప్రతిభ మీద, ముందున్న ఫ్లడ్ లైట్ల మీద పడింది. రసపారవశ్యంతో అభినయిస్తున్న ప్రతిభ ఆ దెబ్బతో కుప్పకూలి పోయింది. పగిలిన విద్యుత్ దీపాల ముక్కలు ఒక్కసారి నలుదిసలకు వెదజల్లబడ్డాయి. అవి ముందు వరుసలో కూర్చున్న అఘో రయ్య ముఖం మీద వేగంగా విరజిమ్మబడ్డాయి.

అఘో రయ్య పెద్దగా దేవీ దేవి అంటూ అరుస్తు కుర్చీలోనే కూర్చుండిపోయాడు. అతడు ప్రదర్శనను ప్రారంభించినప్పటి నుండి ప్రతిభను తదేకదృష్టితో చూస్తున్నాడు. అయితే రంగస్థలం మీద ప్రతిభకు బదులు ఒక దేవత కనబడుతుంది. ఆమె దుర్గ దంశప్రహరణ ధారిణి కాత్యాయని

వాత్సల్యమూర్తి. అఘోరయ్య ఇది ఇంతకు ముందు ఎప్పుడూ పొందని అనుభవం. దుర్గాదేవి శూలంతో ఓరీ! నీ పాపానికి ఇదే పరిహారం అని తన వైపు బలంగా పొడిచినట్లు అనిపించింది. మరుక్షణమే విద్యుద్దీపాలు పగలడం గాజు ముక్కలు అఘోరయ్య ముఖంపై చిమ్మడం రంగస్థలం రక్తసిక్తం కావడం అందరూ భయంకరంగా అరుస్తూ నలుదిక్కులకు చెల్లాచెదరు కావడం సంభవించాయి. మర్నాడు ఆంధ్రదేశంలోని వార్తాపత్రికలన్నీ ఈ విషయాన్ని ప్రముఖంగా ప్రచురించాయి. రంగస్థలంలో కొన్ని పౌరాణిక నాటకాలు ప్రదర్శించే నిమిత్తం వైర్‌ట్రిక్కులను ఏర్పాటు చేసేందుకై పైభాగంలో కొన్ని కొయ్యలను, ఇనుప దిమ్మెలను తీగెలను బిగిస్తారు. అందులో నుండి ఒక దూలం పొరపాటున జారి రంగస్థలంపై పడిందని, తత్ఫలితంగా ప్రతిభ కాలికి దెబ్బ తగిలిందని, పాదరసం ట్యూబులు పగిలి అఘోరయ్య మొఖంపై పడి కళ్ళు పోయాయని పత్రికలు వ్రాశాయి.

అండాళ్ ఈ వార్తను చదివింది. ఈ తరం కూచిపూడి నర్తకులకు నాట్యమే తప్ప మంత్రశాస్త్రం తెలియదు. అలాంటప్పుడు అఘోరయ్య విద్యను తిప్పిగొట్టగలిగే శక్తి ప్రతిభ కెక్కడిది? అఘోరయ్య ఉపాసన వల్లనే ప్రతిభపై ఈ దూలం పడిందా? లేక ఇది కాకతాళీయమూ, యాదృచ్ఛికమూనా? అండాళ్ కేమీ పాలుపోలేదు. జీవితంలో మొదటిసారిగా ఆవిడ మనస్సులో క్షీరసాగర మధన రూపకానికి తన అభినయాన్ని ప్రారంభించింది.

## 17

ప్రతిభ ఇదివరకట్లాగా ప్రదర్శనలు ఇవ్వలేకపోతున్నది. అది అశక్తతమో, వైరాగ్యమో చెప్పలేని ఒక విచిత్ర స్థితి. ఆమెలో అంతర్లీనంగా అణగారి ఉన్న కోరికలన్నీ ఒక్కసారి బహిర్గమించాయి. వివాహం అందులోని మొదటిది. మాతృత్వం రెండవది. ఈ రెండు స్త్రీ సహజమైనవి. ప్రతి స్త్రీ తనకు పెళ్ళి కావాలని, తాను తల్లి కావాలని, చిన్న చిన్న పిల్లలు తనను అమ్మా అని పిలవాలని ఆరాటపడుతుంది. కారణాంతరాల వల్ల ఆ సహజ వాంఛల కామె దూరమైనప్పటికి తాను ఒక స్త్రీయే కాబట్టి అణచి పెట్టబడిన ఆ కోర్కెలు నేల మీదికి విసిరిన రబ్బరు బంతి వలె ద్విధా పైకి విజృంభించక తప్పదు. ప్రతిభ తన విద్యాలయంలోని విద్యార్థులందరిని తనను అమ్మా అని పిలువమని ఆజ్ఞాపించింది. ఇంతకుముందు వారు "టీచర్" అని పిలుస్తుండే వారు. ఇప్పుడామె వారికి తల్లి. వారందరూ తన బిడ్డలు. తన కడుపున పుట్టితేనా బిడ్డలు కావాలి. గురువుకు శిష్యులు బిడ్డలు కారా? వారు తనను అమ్మా అని పిలిచినపుడు ఆ పిలుపులో ఆమె అపూర్వమైన మాధుర్యాన్ని చవిచూసింది. వాత్సల్యంతో వారి తలను, వీపును నిమిరేది. మూర్ధాన్ని ముద్దు పెట్టుకునేది అందులో మరి చిన్నపాపలుంటే తాను వారిని తొడ మీద కూర్చోబెట్టుకునేది. ఒక్కొక్కపుడు తనతో పాటు ఒకరిద్దరు పాపలను భోజనానికి పిలిచేది. తాను కంచంలో కలుపుకున్న అన్నాన్ని చిన్న చిన్న ముద్దలు చేసి బొటనవ్రేలుతో వారికి తినిపించింది. మేం పెద్దవాళ్ళ మయ్యాము టీచర్ మాకింకా ఈ గోరుముద్ద లెందుకు అని వాళ్ళు అంటే ఆమె బాధపడేది. తల్లి దృష్టిలో పిల్లలు ఎప్పుడూ చిన్నవారే అని తాను గోరుముద్దలు పెట్టడాన్ని సమర్థించుకోజూసేది. ఒక్కొక్కప్పుడు చిన్నపాప నిద్రపోతే ఆమెకు దుప్పటి కప్పి ఎవ్వరూ చూడకుండా జో అచ్యుతానంద అంటూ జోల పాడేది. మెలకువతో ఉన్నపుడు అలా లాలిపాట పాడితే ఆ పిల్లయే నవ్వవచ్చు. అందుకని అలా చేసింది. ఇలా ప్రతిభలో మాతృత్వపు ఆర్తి దిన దినానికి పెరిగిపోయింది. సుధారాణి విదేశాల నుండి వచ్చింది. ఆమె ప్రతిభ పరిస్థితి గమనించింది. ఈమె ఉన్మాదిని అవుతున్నదేమో నని భయపడింది.

"అక్కా! ఏమిటీ విచిత్ర ప్రవర్తన" అని ఓదార్చడానికి ప్రయత్నించింది.

"నేనూ స్త్రీనే. నేనూ తల్లినే. బిడ్డలను ఆదరించుకోవాలనే కోరికలో తప్పేమిటి?"

"తప్పులేదు. అందరినీ బిడ్డలుగా భావించడం పూర్వజన్మ సుకృతం. కాని నీలో నీవే ఒక్కొక్కప్పుడు ఏకాంతంగా కూర్చొని జోలపాట పాడుకుంటున్నావు. కాళ్ళపై ఎవరో పసిపాప ఉన్నట్లు ఆ బిడ్డకు నలుగు పెట్టి నీళ్ళు పోస్తున్నట్లు ఊహించుకుంటున్నావు. ఈ అభినయాన్ని ఏమనాలి?"

"ఓసి పిచ్చిదానా! మన జీవితమే పెద్ద అభినయం. లేనిదానిని ఉన్నట్లు ఊహించుకొని నాటకీయంగా అభినయించి చూసినప్పుడే ప్రేక్షకులకు రసోదయం జరుగుతుంది. అలాంటిది నిత్యజీవితంలో నేనిలా చేస్తే తప్పేమిటి? అది రంగస్థలాభినయమైతే ఇది జీవితాభినయం" అని ఒక వెడనవ్వు నవ్వేది ప్రతిభ. ఆమె ప్రముఖ నర్తకి. జీవితమంతా పగలు రాత్రి అనే భేదం లేకుండా విద్యుద్దీపాల మధ్య మెరిసిపోతూ గడిపింది. కాని ఆ దీపాల వెనుక చీకట్లో తన కోరికలు దాక్కున్నాయి. జంటలు జంటలుగా పార్కుల్లో కూర్చునే ప్రేయసిప్రియులు, ఎక్కడి నుంచో ఆహారాన్ని సేకరించుకొని సాయంకాలానికి చెట్టు మీదికి చేరుకున్న ఆడపక్షి, మగపక్షి తమ కూనలకు నోట్లో మేతను పెడుతున్న దృశ్యం. చిరుబుగ్గలతో బొమ్మలలా గెంతుకుంటూ ప్రపరేటరి పాఠశాలలో పరిగెత్తే పిల్లలు – వీళ్ళ తల్లులేరి అని ప్రశ్నించింది ప్రతిభ. వారంతా ఉద్యోగాలకు వెళ్ళారు మేడం. భార్యాభర్త ఇద్దరు ఉద్యోగాలు చేస్తుంటారు. అందుకని మేమే పోషిస్తాం అని చెప్పారు ఆయాలు. ఎంత దురదృష్టవంతులు వీరు. ఉదయం నుండి సాయంకాలం వరకు ఆ పిల్లలు చేసే మనోహర చిద్విలాసాలు కొన్నేళ్ళ తర్వాత మళ్ళీ వారికి కావాలంటే లభిస్తాయా? తల్లిదండ్రులు వచ్చేసరికి ఈ పాపలు నిద్రపోతారు. అలా కొన్నాళ్ళకు వారు పెద్ద వారవుతారు. ఇలా ఈ జాతి మొత్తము మాతృత్వానికి దూరమవుతున్నదే అనుకున్నది ప్రతిభ. శారీరక సుఖం మాత్రం కావాలి గాని సంతాన ఫలం అక్కరలేదట. ఎంత దారుణమైన కోరిక ఇది. జంతువులు కూడ శృంగారాభి తర్వాత దాని ఫలాన్ని కోరుకుంటాయే. లేడి, పావురము, ఆవు వంటివే కాదు పెద్దపులి– చివరికి పంది గూడ తన బిడ్డలకు ఏదైన ఆపద జరుగుచున్నదంటే భయంకరంగా అరుస్తూ శత్రువుల మీద పడిపోతుందే. మనుషులు ఈ జంతువుల కంటే హీనులా?

(ఇంకా ఉంది)




శ్రీను. రాజ్‌గంగ్‌పూర్

★ సంతకాల సాక్షి అగ్ని సాక్షి కాకుండా ఒకరికి ఒకరు సాక్షిగా వుంటే బాగుండదా?

● బాగానే వుంటుంది మగాడికి!

★ జీవితం అనే రైలు యవ్వనమనే స్టేషన్లులో ఎక్కువసేపు ఎందుకాగదు?

● గమ్యం చేరాలి కనుక.

వి. ఎమ్. వడ్లమూడి

★ అబ్బాయిలు ఎమ్ ఎస్సీలు ఎం ఏ లు చదువుకొనేది జ్ఞానము కోసమా? లక్షలకా?

● దొరికితే ఉద్యోగం కోసం. లేదా వచ్చే లక్షల కట్నం కోసం.

★ మారుతున్న కాలంలో కూడా యింకా కులం మతం అని పట్టింపు పట్టే తల్లితండ్రుల నేమి చేయాలి?

● అవి ఎంత అనవసరమో. నమ్మకం కల్గేలాగ చెప్ప కల్గాలి.

కె. జి. ఆర్. విస్సాకోడేరు

★ ఆరుద్రగారి యింటి పేరులో భాగం పంచుకొని మీరు వారి షష్ఠిపూర్తిలో భాగం ఎలా పంచుకున్నారు?

● జీవిత భాగస్వామిని కనుక!

ఎన్. జి. ఆర్. చేబ్రోలు

★ మీరు చాలా కథలు కవితలు వ్యాసాలు రాసి మంచి రచయిత్రి అయ్యారు. అల్లాగే మీరు వెండి తెరపైనటించి అభినేత్రి ఎందుకు కాకూడదు?

● రచయిత్రి కావడానికి బుర్ర కావాలి. నటి కావడానికి బుర్ర అక్కర లేదు. మీకు తెలియదా?! ఎలా రాణించ కల్గుతాను?

★ ఉమర్ ఖయామ్‌పైమీ అభిప్రాయం?

● కవిగానా? ఫిలాసఫర్‌గానా? అడగండే- ఎలా?!

జె. జె. విజయనగరం

★ ఏడుస్తే కన్నీళ్లెందు కొస్తాయి?

● టియర్ డమ్స్ పని చేయడం ప్రారంభిస్తాయి కాబోలు. అయితే కన్నీళ్ళు రాకుండానే ఏడ్చే వాళ్లని మీ రెప్పుడూ చూడలేదా?

★ జీవితంలో తప్పు చేసి పెళ్ళి చేసుకున్నాను అని మరి అందరూ ఆ తప్పే చేస్తున్నారు?

● ఎవరి తప్పు వారిదే కనుక!

బి.వి. ఆర్. ఎమ్. రాయిగడ

★ జన్మ నిచ్చిన తల్లి ప్రేమ గొప్పదా?మనసు నిచ్చిన ప్రేయసి ప్రేమ గొప్పదా?

● ఎలా పోల్చడం? రెండూ ప్రేమలే- కాని ఆకాశానికీ భూమికీ ఉన్న తేడా వాటిలో! ఎవరికేనా జన్మ ఆడదాని భిక్షే. అందుకే తల్లి ప్రేమను దేనితో నూ పోల్చలేరు.

పి. కె. కారంచేడు

★ అక్కయ్యా మీరసలు విమర్శలు భరించలేరు. అంతేకాదు మీ పెడసర సమాధానాలతో ఎదుటి వారిని విసిగిస్తారు. ఆ 'మహాను భావుడు' ఎలా భరిస్తున్నారో మిమ్మల్ని?

● ఏక్ లౌ. (ప్రేముంటే ఏదైనా భరించ వచ్చునని తెలియదా?)

టి. బి. బైపల్లి గ్రామం

★ సృష్టిలో విలువైనది?

● ప్రాణం.

★ ఎన్నో ఉద్గ్రంథములు చదివి అర్థం చేసుకో వచ్చును గాని స్త్రీ మనస్సు అర్థం చేసుకోలేమంటారు.

● ప్రయత్నంలో నిజాయితీ లేక పోవడమే - అందుకు కారణం. ఆఁ ఏముంటుందిలే అంత అర్థం కానిది- అన్న తేలిక భావం.

ఎస్. వి. ఆర్. కలకత్తా

★ మీకు తెలుగు నాడులో ఎక్కడా యిల్లు దొరకలేదా? తమిళనాడులో మకాం పెట్టారు?

● ఇల్లు దొరక్క కాదు. ఇక్కడ దశాబ్దాలుగా వుండి పోవడం వల్ల. ఏం మీ రెందుకు కలకత్తాలో వున్నట్టు?!

★ మీరు ఎప్పుడైనా ప్రపంచ మహాసభలకి వెళ్లారా?

● తొలి సభలకి వెళ్ళా. పనసకాయ చూసి తద్దినం పెట్టినట్టు మనుమల్ని చూసి సన్మానానికి పిలిచారు. నేను తిరస్కరించాను. అందుకే జ్ఞాపకం వుంది.

శ్రీను. రాజ్‌గంగ్‌పూరు

★ ఇంచు మించు అన్ని దూరాలు తెలుసు కున్నాను. కాని భూమధ్య రేఖకు దారిద్ర రేఖకు మధ్య ఉన్న దూరం ఎంత?

● అదీ తెలియగానే నాకూ చెప్పండి. నాకూ తెలియదు.

★ ప్రేమ రెండే అక్షరాలు. అది గగనాలు సాగరాలు అంటారు మీరేమంటారు?

● పిచ్చి వాళ్ల నిర్వచనం అంటా.

ఎ. హెచ్. కె. వేమూరు

★ అబ్బాయి అమ్మాయి ప్రేమించుకొంటే- అమ్మాయి ముందుగనే తప్పుకొంటే- మీరు జాగ్రత్త పడింది అంటారు. అబ్బాయి తప్పుకుంటే తిడతా రెందుకు?

● అమ్మాయిల మనస్సు యీసెళ్ల లాంటిది- రాగల కష్టాల వాన గ్రహిస్తుంది. అందుకే జాగ్రత్త పడుతుంది. అబ్బాయి లలాకాదే దీపాల్లా వెల్గుతూనే వుంటారు- ఎన్ని ఈసెళ్ల రెక్కలూడి పడినా - వారికేం యిబ్బంది?! □

ఇటీవల ఢిల్లీలో జరిగిన అంతర్జాతీయ వాణిజ్య ప్రదర్శనలో నవంబరు 22న ఆంధ్రప్రదేశ్ ఉత్సవంలో ఏర్పాటు చేసిన సాంస్కృతిక కార్యక్రమంలో గాత్ర కచేరి చేసిన ఢిల్లీ ఆకాశవాణి కర్నాటక సంగీతం ప్రొడ్యూసర్ శ్రీమతి జి. వైదేహిని రాష్ట్ర ప్రభుత్వం తరపున సత్కరిస్తున్న ఆంధ్రప్రదేశ్ చిన్నతరహా పరిశ్రమల మంత్రి శ్రీ ఎస్. రామచంద్రారెడ్డిని చిత్రంలో చూడవచ్చు.



# జలుబు మటు మాయమవు తుందా?



మనిషికి జలుబుని కలిగించే రైనో వైరస్ - 14 త్రీ-డి- కంప్యూటర్ చిత్రం!

శాస్త్ర విజ్ఞానం ఎంతగా పరిధిని పెంచుకొంటున్నా జలుబు వంటి అతి చిన్న జబ్బును రూపుమాపలేక పోతోంది. దీనికి కారణం జలుబుకి మూలమైన రైనో వైరస్ -14 పూర్తి వివరాలు అందుబాటులో లేకపోవడమేనని ఎంతో మంది శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

కార్నెల్ విశ్వవిద్యాలయానికి చెందిన హై ఎనర్జి సింకోట్రాన్ సోర్స్ నించి, ఎక్స్-కిరణాలని పరిగ్రహించి, స్ఫటికీకరించిన వైరస్ కణాలలోకి వాటిని కేంద్రీకరింపజేసి, అటు తరువాత సైబర్ 205 సూపర్ కంప్యూటర్ని వాడి ఆ వైరస్ యొక్క త్రీ-డి - చిత్రం తీయడం జరిగింది. ఈ హెచ్. ఆర్. వి. 14 వైరస్ నిర్మాణం బహు సంక్లిష్టమైంది. ఈ వైరస్ లో జన్యుపదార్థం చుట్టూ ఇరవై ముఖాలు కలిగిన రక్షక కుడ్యం పైపో ప్రొటీన్ల చేత రూపొందించబడి ఉంటుంది. పార్శ్వ భాగాలలోని నాలుగు వైపులా ఉన్న ముఖాలు ఒకే విధమైన త్రికోణాలలాగా ఉంటాయి. ప్రతి పార్శ్వ భాగంలోనూ మూడు ముఖాలు ఉంటాయి. ప్రతి త్రికోణం తలమీదా మూడు ప్రొటీన్లు ఉంటాయి. త్రికోణం మధ్యలో లోతుగా మరో ప్రొటీన్ కూడా ఉంటుంది. మొత్తంమీద ఈ వైరస్ సాసర్ బాల్ లాగా కనిపిస్తుంది. వైరస్లోని ప్రొటీన్లే మానవ కణాన్ని అంటిపెట్టుకొని ఉండడానికి సహకరిస్తాయి. ఈ ప్రొటీన్ల చర్యాశీలతని పడగొట్టగలిగితే మానవ జీవకణంలో వైరస్ మనలేదు. వెంటనే మరణిస్తుంది (!?). మందుల ద్వారా ఈ పని చేయవచ్చు. లేదా ప్రొటీన్లని ఆకర్షించి వాటి శక్తిని క్షీణింపజేసే జీవసంబంధమైన సేంద్రియ ధాతువులయినా ఉపయోగించ వచ్చును.

వైరస్ నిర్మాణం తెలియడమే బహు క్లిష్టం. తెలిసిపోయాక సమస్యని పరిష్కరించడం అతి సులభం. త్వరలోనే పడిశం మటుమాయం కాగలదని ఆశించవచ్చు! □

# బాబోయ్ గ్యాస్ లీకేజి *

— రవీంద్ర




















## జాడ తెలియని దర్శకుడు!

దేవి ఫిలిమ్స్ ప్రొడక్షన్స్ దర్శకుడు పురుషోత్తమ్ అనే ఆయన మహబూబ్‌నగర్‌కు చెందిన బెంచుపల్లి వద్ద కృష్ణానదిలో మోటారు బోటుల మీద కొన్ని దృశ్యాలు చిత్రీకరించి, యూనిట్‌వారితో వో మోటారు బోటులో తిరిగివస్తుండగా ఆ బోటు బోల్తాకొట్టిందట. ఆయన తప్ప ఆ బోటులోని వారంతా వొడ్డుకు యీదుకొచ్చేశారట. ఆయన జాడ తెలియలేదట. ఆయనకు యీత రాదట!

## నిరుద్యోగి భార్య ఆత్మహత్య!

హైదరాబాదు బిస్తీ చమన్‌కు చెందిన 22 ఏళ్ల కమలాబాయ్ అనే ఆమె భర్త భీమారావుకు శతవిధాల ప్రయత్నించినా ఏ వుద్యోగమూ రాలేదట. భర్త నిరుద్యోగ బాధను, తద్వారా తాననుభవిస్తున్న మానసిక నరక బాధను, అసంతృప్తిని, అవమానాలనూ సహించలేక ఆమె మీద కిరసనాయిలు పోసుకు అంటించుకుని ఆత్మహత్య చేసుకున్నదట.

## అబలపై అత్యాచారం చేయబోయిన హెడ్‌కానిస్టేబుల్!

రంగారెడ్డి జిల్లా షమీర్‌పేటలో వో పోలీసు హెడ్ కానిస్టేబుల్ 11వ తేదీ రాత్రి ఓ వాచ్‌మన్ భార్యను బలాత్కరించి, తన కామవాంఛ తీర్చుకోబోయేసరి కామె చమత్కారంగా అతన్ని మోసగించి, ఇంట్లో బంధించి, బయట గొళ్ళెంపెట్టి కేకలు వేసి, నలుగుర్ని పిలిచి పట్టిచ్చేసిందట.

## భారతదేశంలో నిరుద్యోగులు!

భారతదేశంలోని వివిధ ఎంప్లాయ్‌మెంట్ ఎక్ఛేంజిలలోని లెక్కల ప్రకారం దేశంలో 1984 నాటికి 23.5 లక్షల నిరుద్యోగులున్నారని లేబరు మంత్రి అంజయ్యగారన్నారట. అయితే రిజిస్టరు చేసుకోని నిరుద్యోగులు దీనికో పది రెట్లుండరూ ... ఎందుకుండరూ... అందులో మన దేశానికి బీదరికము లేదు కదా! కాదా!!

## ఒకే నాటకాన్ని 4,625 సార్లు ప్రదర్శించిన నటుడు! .

ప్రఖ్యాత హాలీవుడ్ చలనచిత్ర నటుడు యుల్‌బ్రిన్నర్ తాను సినిమాలలో చేరకముందు టెలివిజనులో నాటకాలు వేసేవారుట. "సయామీస్ కింగ్" అనే నాటకాన్ని తానే రూపొందించి, తానే దర్శకత్వం నెరపి, తానే ఆ సయామీస్ కింగ్ పాత్ర తానే ధరించి వేసే వాడట. 1985 అక్టోబర్ 10వ తేదిన చనిపోయిన యీ నటుడు తన జీవితకాలంలో "ఆ సయామీస్ కింగ్" నాటకాన్ని 4,625 సార్లు ప్రదర్శించాడట. ఆఖరిసారిగా 4,625వ సారిగా ఆయన యీ ప్రదర్శనను జూన్‌లో యిచ్చారట.

## జీవించి వున్నట్లు నిరూపిస్తేనే పింఛను!

ప్రాకిచెర్లకు చెందిన గొంతువులి సుబ్బారావు అనే అతనికి 1985 ఫిబ్రవరి నుంచి పింఛను డబ్బులు రాలేదని బందరు సబ్ ట్రెజరీకి వెళ్తే అక్కడి అధికారులు నువ్వు చనిపోయినట్టు మాకు వచ్చిన సమాచారం ప్రకారం మేము నీ పేర ఆ డబ్బు పంపడం మానేశాము. నువ్వు బ్రతికి వున్నట్లు రెవెన్యూ ఆఫీసు అధికారులను నమ్మించి ఆ విషయాన్ని మాకు వారి చేత తెలియపరచు. అందాకా మేము నీ పింఛను పంపజాలము అన్నారట.

## పొలానికి వెడుతున్న ఇల్లాల్ని మానభంగం !

కళ్ళకుర్తికి చెందిన కూరిచలూరు గ్రామంలో మణిపత్తెయాచ్చి అనే వో వ్యవసాయదారుని భార్య 17 ఏళ్ళ రాజేశ్వరి రోజూ తన భర్తకు భోజనం పొలానికి తసుకు వెళ్తుండటం అదే వూరుకు చెందిన 47 ఏళ్ళ పధక్ అనే అతను చూసే వాడట. పధక్ వో పథకం వేసి ఒకనాడు ఆమెని కత్తి చూపి బెదిరించి, అరటి తోపుల్లోకి లాక్కుపోయి తన కామవాంఛ తర్చుకుని, సొమ్మసిల్లి స్పృహతప్పిన ఆ ఎల్లాను అలానే నగ్నంగా వదిలేసి పారిపోయాడట. ఆమెకు పెళ్ళయి ఆర్నెలలే అయ్యిందట పాపం!

## కామశాస్త్రంలో పట్టాలు!

సౌత్ కరోలినా విశ్వవిద్యాలయంలో కామశాస్త్రంలో కూడా పట్టాలనిచ్చే ఏర్పాటుచేసిందట. ప్రతి సబ్జక్టూ చెప్పినట్లు యీ సబ్జక్టూ థియరీ చెప్పి అనక వీడియోల ద్వారా యీ కామశాస్త్రాన్ని వివరించి, అనక విద్యార్థి విద్యార్థినులను జంటలుగా వారిష్ట ప్రకారం ఏర్పడి యీ శాస్త్రంలో ప్రాక్టికల్స్ అధ్యయనం చేయమని, అనక ప్యాసయిన వారికి పట్టాలు చేతికిస్తారట! తెలివి మితిమీరి పిచ్చిగా మారుతుందన్న మాట అక్షరాలా నిజం అనిపించుతున్నది!

## ప్రాణం తీసిన అక్రమ సంబంధం

పిరణాంపట్టి గ్రామానికి చెందిన 70 ఏళ్ళ కుళంధై గవుండరు రెండో భార్య మునియమ్మ అదే వూరుకు చెందిన సెట్టు అనే అతనితో రహస్య కామాయణం పెట్టుకుని, అదేమంటే అతనితో లేచిపోయిందట. కొన్నాళ్ళు సెట్టుతో కామ కాపురం చేసి అనక తిరిగి తన నిజ భర్తను చేరి, అతనితో వుండిపోతానని బ్రతిమాలి వొప్పించి, వుండిపోయిందట. దాంతో ఆమె కామరేడు సెట్టుకు కోపం వచ్చి, ఏదో వంకతో ఆమెను పట్టుకుని, రాళ్ళతో కొట్టి చంపేశాడట. ఈ ఘాతుకంలో అతనికి అతని చిన్నాన్న అల్లిముత్తు కూడా తోడ్పడ్డాడట.

## రైల్లో వేశ్యాగృహం!

లండన్ గ్లాస్గోల మధ్య నడిచే వో ఎక్స్‌ప్రెస్ (రాత్రి) ట్రయినును ఆ ప్రయాణీకులూ, ఆ ట్రయిను సంగతి తెలిసినవారూ "ది నైట్ సెక్స్‌ప్రెస్" అని పిల్చుకుంటారట ముద్దుగా. ప్రయాణీకుల సౌకర్యార్థం వీడియో సినిమాలు ఆ ట్రయినులో ఆరంభించి, అదే ఫలితం కోసం అంచెలు అంచెలుగా సౌకర్యాలు ఎక్కువ చేస్తూ "బూతు సినిమాలు" చూపించి, అనక అందమైన అమ్మాయిలను కూడా అందుబాటులో వుంచి రన్నింగ్ వేశ్యాగృహం కూడా నడపనారంభించారట ఆ రైలులో! □



# పెద్ద దిక్కు

ఎ.వి.శేషారత్నం

"సీతమ్మకు చేయిస్తి చింతాకు పతకము రామచంద్రా! ఆ పతకమునకు పట్టె పదివేల వరహాలు రామచంద్రా!

'ఒరే రాముడూ! వేగుచుక్క పొడిచింది. లే. లే. ఇవాళ పట్నం వెళ్లాలన్నావు కాదూ!'

చల్ల కవ్వం చిలుకుతున్న చప్పుడులో మళ్లీ రామదాసు కీర్తన -

"అబ్బ తిట్టితిననీ ఆయాసపడబోకు రామచంద్రా! ఈ దెబ్బల కోర్వక అట్లు తిట్టితినయ్యా రామచంద్రా!

'నాగలక్ష్మీ! ఏడకల దాలి వెలిగించావా? లచ్చిందేవి నిన్ననేగా ఈనింది దానికి చొప్ప పెట్టబోకు.'

ఆడపిల్ల ఉసురు ఊరందరికి కొడుతుందిరోయ్! పిల్ల నేడిపించనికు.'

'నానమ్మా అమ్మ పిలుస్తోందే! ఎక్కువగా మాట్లాడవద్దంటోంది. నీరసమొస్తుందిగా.' -చిన్నాడు అన్నపూర్ణమ్మను వాటేసుకున్నాడు.

'బువ్వ తిన్నావా చిన్నీ!' - ప్రేమగా వాడిని ఒళ్లోకి తీసుకుందావిడ.

'ఏమిటి అన్నపూర్ణమ్మగారూ! ఒళ్లు వెచ్చబడిందట. ఆచారిని పిలిపించకపోయారా?' - పోస్ట్‌మాస్టర్ జగన్నాథం ఇంటికెళ్తూ పలకరించాడు.

'జగన్నాథం! లాట్రీ వచ్చిందటయ్యా' -అన్నపూర్ణమ్మకి ఏదో గుర్తుకొచ్చినట్టడిగింది

రోజూ వినిపించే సుప్రభాతాలు ఆనాడు వినిపించలేదు కారణం అన్నపూర్ణమ్మగారు లేపలేదు ఆవిడ లేపందే లేవని వెంకట్రామయ్య విసుక్కుంటూ ఆరు కొట్టాక లేచాడు

'ఏతాల రోజు గదా! పట్నం వెళ్లాలని రాత్రి చెప్పాను లేపావు కాదేమే అమ్మా!' - పళ్లు తోముతూ పెరట్లో తులసి కోట వైపు చూసాడు వెంకట్రామయ్య

ఎప్పుడూ ముగ్గుల్లతో కళకళలాడే తులసి కోట వెల వెలబోతోంది అలవాటైన తల్లి పాట వినిపించలేదు. వెంకట్రామయ్యకు గాభరా వేసి పడమటి గది వైపు పరుగెత్తాడు అన్నపూర్ణమ్మగారు మూలుగుతోంది

'ఒళ్లు వెచ్చబడిందా అమ్మా!' ఆవిడ నుదుట మీద చెయ్యిపడేసరికి కళ్లు విప్పిందావిడ

'రాత్రిపూట ధనియాల పొడి వేడి చేసిందిరా రాముడూ! తగ్గిపోతుందిలే నువ్వు పని చూసుకో' - నిట్టూర్చాడు వెంకట్రామయ్య

'వద్దంటే వినకుండా బొంగరంలా తిరుగుతావు కదా! ఇంట్లో పని లక్ష్మి చూసుకుంటుంది కదే అమ్మా! నీ వయసు మర్చిపోయి మరి తిరుగుతావు కదా!'

'పోరా పిచ్చి సన్నాసి! నలుగురు పిల్లల్తో దానికి నడుం విరిగిపోదూ! అయినా నే చేస్తున్నదేమిటిలే - ముసలితనం - ఈమాత్రం దానికి గాభరాపడకు వెళ్లు!'

'అత్తయ్యా! ఈవేళ కుడితి బాగా పొయ్యవచ్చా? ఆ తొట్టి వేపే చూస్తోంది లేచిం దగ్గర్నుంచి -' నాగలక్ష్మి అడిగింది.

'నానమ్మా! చిన్నాడు చూడు నా జడని తెలుకోండ అంటున్నాడు' - రెండో మనవరాలు ఫిర్యాదు చేసింది 'అబ్బబ్బ నానమ్మకి జ్వరమొచ్చింది గానీ విసిగించక అవతలకు పోయి ఆడుకోండి ఇదిగో సుబ్బులూ పిల్లని బయటకు పిలు అత్తగారి ఒళ్లు ముట్టుకుని చూసిన నాగలక్ష్మి పిల్లల్ని కసిరింది

ఆ రోజంతా ఎవరికీ కాలూ చెయ్యీ ఆడలేదు అన్నపూర్ణమ్మగారు మర్నాటి మధ్యాహ్నందాకా మూసిన కన్ను తెరవలేదు

ఆ సాయంత్రం బయట అరుగుమీద కూర్చున్న అన్నపూర్ణమ్మను నాగలక్ష్మి కేకలేసింది

'చలి గాలిలో ఎందుకు లోపల కూర్చోండి.'

'లోపలి ఉక్కకు ప్రాణం పోతోందే లక్ష్మీ! చల్లగాలికి కాస్త ప్రాణం లేచి వచ్చినట్టుంది

'పెద్దమ్మగారూ! నిన్నా ఇయ్యాల తమరు బోణీ చేసారు కాదు కాయగూరలు మిగిలిపోయాయి జొరం తగ్గిందా తల్లీ!' - కూరల నరసమ్మ ఆప్యాయంగా పలకరించింది

'కరేపాకు తాలింపెట్టిన మీ సేతి చారు పడలేదు మా మావ ఎవాలెత్తిపోయాడు పూర్ణమ్మగోరూ!' - ఎదుటి పాకలోని తాయారు నవ్వింది

'ఏమే ఎంపాలూ నీ మొగుడికి ఇవాళా పస్తేనా? రోజంతా ఆ గోరింటాకు సింగారింపుకే చాలదే'- పరాల్ని పరాచికమాడింది అన్నపూర్ణమ్మ

'పొండమ్మా! ఆడిలాగే మీరూ నన్ను ఆట పట్టిత్తన్నారు' పరాలు ముసి ముసి నవ్వులు నవ్వింది

'ఏరా కాసులూ నీ పెళ్లి కుదిరిందిటగా - పిల్ల లక్ష్మీదేవిలాగుంది. పావలా అర్ధా కట్నం కోసం మీ నాన్న బేరాలాడుతుంటే నోరు విప్పలేపురా వాజెమ్మా! మళ్లీ పట్నంలో చదివానంటావు ఉపన్యాసా-లిచ్చానంటావు'

'లేదు బామ్మగారూ! పిల్ల తండ్రి కట్నం ఎక్కువిస్తానని'

"అనత్రా గాడిదా! పెద్ద పిల్లను చూట్టానికి వెళ్లి "రెండో పిల్లనిస్తే ఇయ్యి లేకపోతే లేదు" అని మీ నాన్న మెలికేస్తే ఆడపిల్ల తండ్రి ఏం చేస్తాడు?

'భలేవారేనండి ఏమైనా మహా గట్టివారు సుమండీ! పది పరకా కుంచానమ్మలా కూడబెట్టి రెండు పందలు చేసారు. అంతా మీలా ఉంటే ఎంత బాగు? మా ఆవిడా ఉంది. మంచానమ్మలా మాయం చెయ్యడం తప్పితే పైసా నిలవ్వేసిన పుణ్యాన పోదు '

'అడిగిందో కథైతే సోది చెప్తావేమయ్యా జగన్నాథం?' 'అమ్మమ్మ ఎంత మాట! రెండేళ్లుగా కాయా పండు కొనుక్కోమని ఇచ్చిన పది పరకా దాచి కూడబెట్టి ఇన్నాళ్లూ పైసా తీయలేదు మీకు తప్పకుండా ప్రైజు వస్తుంది ఆర్నెల్లపాటు రెండొందలు తియ్యకపోతే మీ పేరు లాటరీలో కలుపుతారు. నంబరులో మీ పేరు పంపాలెండి. మరో పది రోజుల్లో తెలుస్తుంది. అయినా ప్రయిజు వస్తే ఏం చేస్తారు పూర్ణమ్మగారూ!'

'మా రాముడు వట్టి వెర్రిబాగులవాడయ్యా! ఆ మగనలుసు ముందే పుడితే చేతికందొచ్చేవాడు. కాని ముందు ముగ్గురూ ఆడపిల్లలు ఇద్దరు పెళ్లికెదిగి కూర్చున్నారా? చేసేది పంతులుద్యోగం ఏం పెట్టి సాగనంపుతాడు వీళ్లని? ఆ లాట్రీ ఏదో వస్తే వేడినీళ్లకి చన్నీళ్లు సాయం.'

'అదృష్టవంతుడండి వెంకట్రామయ్య కడుపున పుట్టిన బిడ్డ కాకపోయినా కన్నతల్లిలా కాపాడుకొస్తున్నారు' 'అదేం మాట జగన్నాథం! నా పెద్ద కొడుకు దేశాలు పట్టిపోయాడు రెండో వాడికి తల్లి అక్కర్లేదు మిలట్రీలో చేరిపోయాడా? గుర్తొచ్చినపుడు ఏ అయిదేళ్లకో చూసిపోతున్నాడు. ఆయన దగ్గర చిన్నప్పుడెప్పుడో నాలుగక్షరమ్ముక్కలు నేర్చుకున్న పుణ్యానికి వెంకట్రాముడు నన్ను తల్లిలా పోషిస్తున్నాడు. ఏ జన్మలోదో ఋణానుబంధం, వీడే నా కొడుకు చచ్చిపోయినా వీడి మీద మమకారం వదలదు నాకు.'

'సందె పొద్దువేళ అవేం మాటలమ్మా! మీకేం నూరేళ్లు బ్రతుకుతారు. వస్తాను' - జగన్నాథం

వెళ్ళిపోయాడు.

'అమ్మా చలిగాలిలో కూర్చున్నావేమే!' - తిరిగి తిరిగి అలిసిపోయిన వెంకట్రామయ్య అన్నపూర్ణమ్మగారి రెక్క పట్టుకుని లేవదీసి లోపలికి తీసికెళ్లాడు.

'కడుపులో గుబులుగా ఉందిరా రాముడూ.'-

'రాజాకి ఉత్తరం రాయనా అమ్మా! బెంగపెట్టుకో లేదు కదా!'-

- దిగులుగా ఉంది వెంకట్రామయ్య కంఠం.

'లేదురా నీ గురించే నా బెంగంతా. ఆ తిమ్మాపురం సంబంధం ఏమయింది? అబ్బాయి సుబ్బులుకి ఈడూ జోడూ బాగున్నాడురా. మరో అయిదు వేలయితేనేం?'

'ఎక్కడ తేనమ్మా! ఉన్న పొలం కాస్తా ఇప్పటికే హరించుకు పోయిందా! అయినా వాళ్లు మరీ డబ్బు మనుషుల్లా ఉన్నారే.'

పెళ్లికొడుకు బుద్ధిమంతుడురా రాముడూ!పిల్లని పువ్వుల్లో పెట్టి చూసుకుంటాడు. పోనీ మీ గరువుగారి పొలం ..'

'అమ్మా' - దెబ్బతిన్న లేగదూడలా గిలగిల్లాడు.

'అంత మాటన్నావు చాలమ్మా! రాజాకి ఇప్పటికే నామీద కోపంగా వుంది. అయినా గురువుగారి ఆస్థి కొడుక్కి ...'

'ఆ అప్రాచ్యుడి పేరెత్తకురా రాముడూ! తండ్రి పోయాడని తల్లి అనే ప్రాణం బ్రతికుందనీ వాడు ఆలోచించాడా! పెద్దాడు ఎలాగూ లేడు. వీడు మిలట్రీకి పోయాడని చెప్పుకు బతుకుతున్నాను. కానీ పెళ్లాం మాటలు వినేవాడికి నేనెంత బరువైపోయానో చూసావుగా. వాడి ఉత్తరం చదివావా? వాడీ వూరు రాడట పొలం తెగనమ్మి డబ్బు పంపాలిట. నేను



మాత్రం రాకూడదట. చూ సావురా వాడి స్వార్థం?'

'అలా అనకమ్మా! పొలం బేరం పెట్టాను. డబ్బు పంపిద్దాంలే. కానీ నువ్వు మాత్రం నన్ను వదిలి వెళ్ళకే. రాజా అడిగినా నిన్ను నేను పంపనమ్మా' - ఆర్తిగా ఆవిడ చెయ్యి నిమిరాడు వెంకట్రామయ్య.

'పిచ్చి సన్నాసీ నిన్ను వదిలి నేను మాత్రం వెళ్ళగలనా! నాలుగేళ్ళ క్రితం కొడుకు ఉద్ధరిస్తాడని వెళ్ళి వాళ్ళ చేతిలో ఎంత నరకం చవిచూసాను? మనిద్దరికి ఏ జన్మలో నో ఋణం నాయనా! నాగలక్ష్మి ఉత్తమురాలు. దాన్నెప్పుడూ కష్టపెట్టకేం నాన్నా!'

'పడుకో అమ్మా! పొద్దు పోయింది. నువ్వేం ఆలోచనలు పెట్టుకోకు.' - రగ్గు కప్పి లేచాడు.

బయట శరత్కాలపు వెన్నెల విరగబూసింది. వెంకట్రామయ్య కళ్ళలో ముత్యాలు - చలిగా ఉన్నా చిరు చెమటలు పడతున్నాయి.

తల్లి ప్రేమ నెరుగని తనకి చిన్నప్పుడు ఈ గురుపత్ని మాతృ మమకారం చవిచూపింది. తన బిడ్డలకి పరాయి బిడ్డలకి భేదం చూపని అన్నపూర్ణమ్మ ఆవిడ.

'రాముడూ! పూర్ణ చాల అమాయకురాలు. రాజా ఎలాగూ దాన్ని చూడడు. నీ మీద నమ్మకంతో నే వదిలి వెళ్తున్నాను సుమా!' - గురువుగారి చివరి మాటలకి భోరున ఏడ్చాడు తను.

ఈ రోజన అయిదు వేళ్ళు లోపలికి వెళ్తున్నాయంటే ఆయన చలవే. మేనమామలు

## రభస!

తనకు కావలసిన
అందచందాల అమ్మాయిని
వెతుక్కోవచ్చునని అబ్బాయి ఆశ....
తనకు ఇష్టమున్నా లేకున్నా
అతను నచ్చుకుంటే
ఒప్పుకోక తప్పదని అమ్మాయి నిరాశ...
ఇదీ...పెండ్లి చూపుల వరుస
నిజానికిది ఏకపక్ష రభస!

—ఎన్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

## పెద్ద దిక్కు

పట్టనట్టు వదిలేస్తే తల్లీ తండ్రీ లేని తనకి విద్యా దానంతో బాటు జీవితం కూడ దానం చేసారాయన. అలాంటిది అన్నపూర్ణమ్మగారు తనకు బరువా?

రాత్రి చాలా సేపటి దాకా నిద్రపట్టింది కాదు వెంకట్రామయ్యకి.

ఆ తర్వాత పదిహేను రోజుల్లో పొలం అమ్మిన డబ్బు రాజారావుకి పంపించేశాడు. అన్నపూర్ణమ్మ గారెందుకో బాగా దిగులుపడిపోయింది. రోజు రోజుకీ మనిషి నీరసించి పోతోంది.

'అమ్మగారూ! చంటాడు బాగా ఏడుస్తున్నాడమ్మా - అనే మంగికి

'దిష్టి తగిలిందేమో కాస్త ఉప్పు దిగదుడిచి నిప్పులో పొయ్యవే. చిటపటమంటే దిష్టి అన్నమాటే.'

'రాజ్యం మీ ఆయన జ్వరం తగ్గిందా? ఇంగ్లీషు మందులు వాడకు. అతనికి పడవు. మూడు పూటలా ఇంత మిరియాల కషాయం కాచి పోసావంటే గజ్జెల గుర్రంలా లేస్తాడు.'

ఆ రోజు చాలా రోజుల తర్వాత ఆవిడలో హుషారు కనిపించింది అందరికీ. తులసికోట చుట్టూ పసుపు కుంకుమలతో రంగవల్లికలు తీర్చింది.

'నాగలక్ష్మీ! లేగదూడ ఆకలితో అరుస్తోంది చూడు. కాస్త పాలు ఎక్కువ వదిలెయ్యి తల్లి దగ్గర.'

'అలాగే అత్తయ్యా! పోస్టుమాస్టరుగారి శాంత పెద్దపిల్ల అయిందట. మీరూ రావాలి అక్షింతలు వేసేందుకు అని ఆవిడ ఒకటే పట్టు. మీకు నీరసం తగ్గలేదు కదా!'

'దానిదేముందే లక్ష్మీ - కార్తీక పౌర్ణమి కదా! ఎలాగూ ఉపవాసమే. కాస్త పొద్దు పోయాక చూసి వస్తాలే. రాముడొచ్చాడా స్కూలు నుంచి?'

'లేదత్తయ్యా!'

'జగన్నాథం పట్నం వెళ్ళాడట - వచ్చాడటనా?'

'వాళ్ల పెద్దబ్బాయి ఉద్యోగం పనిమీద తిరుగుతున్నాడట. రేపు వస్తారేమో! ఏం పని?

కార్నులు గానీ కావాలా?'

'కాదులే.'

ఆ రోజు కాలుకాలిన పిల్లిలా తిరుగుతూనే ఉందావిడ.

'జగన్నాథం వచ్చాడటనా' - రాత్రి పడుకోబోయే ముందు మళ్లీ అడిగింది.

'లేదమ్మా ఏం కావాలి?' - వెంకట్రామయ్య అలవాటుగా - పడుకోబోయే ముందు ఆవిడను అడిగాడు.

'ఏం లేదులే పడుకోపోయి -

మర్నాడు వేగుచుక్క పొడిచే వేళ -

"లక్ష్మణునకు చేయిస్తి లక్షల పతకము రామచంద్రా!' ఆ పతకమునకు పట్టె పదిలక్షల వరహాలు రామచంద్రా'-

'రాముడూ వేగుచుక్క పొడిచింది లేవరా'

"ఇది ఎవడబ్బ సొమ్మని కులుకుచూ తిరిగావు రామచంద్రా"

'నాగలక్ష్మి పిడకల దాలి అంటించావా?'

'సుబ్బులూ! తులసీకోట దగ్గర ముగ్గు వేసావా?'

ఈ సుప్రభాతాలేమి వినిపించలేదు. ఆలస్యంగా లేచిన వెంకట్రామయ్యకు ఘొల్లున ఏడుపులు వినిపించి గుండె ఆగినంత పనయింది. పరుగున పడమట గది వైపు వెళ్లాడు.

నాగలక్ష్మి సుబ్బులు చిన్ని - అన్నపూర్ణమ్మ శరీరం మీద పడి ఏడుస్తున్నారు.

'అమ్మా!' - వెంకట్రామయ్య గొంతు పెగలలేదు. గుండె రాయి అయిపోయింది.

తిరనాళ్ల జనం - అది చావు కాదు - వీరభద్రుడి సంబరంలాగుంది.

రాజారావు కోసం రోజంతా చూసి చూసి మర్నాడు 'గోవిందా' అంటూ శవాన్నెత్తారు. ఒక పెళ్లి ఊరేగింపులా తరలింది జనం -

బస్సు దిగిన జగన్నాథం నిశ్చేష్టుడయ్యాడు. ఆ సాయంత్రం జగన్నాథం చెప్పింది విని ఇంటిల్లిపాది నిశ్చేష్టులయ్యారు.

అన్నపూర్ణమ్మకు పోస్టల్ సేవింగ్స్ లాటరిలో ఇరవై వేలు బహుమతి వచ్చిందట. పట్నంలో పని వదిలేసి కబురు చెప్పేందుకు పరిగెత్తుకొచ్చాడు జగన్నాథం.

'జగన్నాథం వచ్చాడా?' - అని ఎందుకు నిన్న ఆవిడ అన్నిసార్లడిగిందో బోధపడింది అందరికీ.

'ఎంత సంబరంగా వచ్చాను వెంకట్రామయ్యా! నువ్వు అదృష్టవంతుడివి. జ్వరం వచ్చింది లగాయితూ అన్నపూర్ణమ్మగారికి నీ గురించి చింత ఎక్కువయింది. ఆవిడకెందుకో బహుమతి వస్తుందని నమ్మకం. నామినీగా నీ పేరు రాయిస్తుంటే నాకా రోజు నవ్వొచ్చింది. ఏది ఏమైనా నీ యింటి పెద్ద దిక్కు పెద్ద నిధినిచ్చి మలిగిపోయింది.' - జగన్నాథం కళ్లు తుడుచుకున్నాడు భారంగా.

ఆ యింటి అరుగు ఖాళీ అయింది వచ్చే పోయేవారిని వెక్కిరిస్తూ -

'అమ్మగారూ! చంటాడికి జ్వరం - ఏం చెయ్యమంటారు.' - అలవాటుగా అడగబోతూనే వున్నారు ఆశ్రిత జనులు.

ఆ యింట్లో ఆవిడ తిరగని చోటుగాని చెయ్యని పనిగానీ లేదేమో - ఎన్నేళ్లయినా వెంకట్రామయ్య కుటుంబం ఆవిడ ఉందని పొరబడుతూనే వుంటుంది. పడమటి గది మాత్రం నిట్టూరుస్తూ ఉసూరు మంటోంది.

కారణం - ఆ గదిలో గాలి ఈల వేస్తుంది-

'రాముడూ! సుబ్బులు పెళ్లికి ఉపయోగపడుతుందనుకున్న లాట్రీ డబ్బు రాజాకిచ్చేసావా?'- అంటూ -

ఏవో వినిపించినట్టు ఆ గది దగ్గరే తచ్చాడుతూ అంటాడు వెంకట్రామయ్య.

'అమ్మా! నీ ఆశీస్సులు చాలే! కాయా పండూ కొనుక్కోమని నీకిచ్చినట్టు రెండు వందలు మళ్లీ వేసానే సేవింగ్స్‌లో - ఈసారి బహుమతి వస్తే నాదేనమ్మా!'

నిట్టూర్చిన గాలి దీవిస్తున్నట్టు అతన్ని చల్లగా తాకి మరి కదులుతుంది భారంగా.

మనిషికి మనిషి దూరం కావచ్చు. అనుభూతికి దూరంలో తోనూ, కాలంతోనూ పనేమిటి?

కవ్వం చిలుకుతున్న చప్పుడు వినిపించినా -

తులసికోట దగ్గర ముగ్గు కనిపించినా -

లచ్చిందేవి అంబాయని అరిచినా -

'అమ్మా లేచావుటే' - అంటాడు వెంకట్రామయ్య అలవాటుగా. □

## ఇ·వేమన·పద్యాలు




ధనమే మూలము జగతికి
ధనమే మూలంబు సకల ధర్మంబులకున్
ధనమే మూలము సిరులకు
ధనమే మూలంబు ముక్తిదాపగు వేమ





# సినిమా వి

_జి.వి.

"వేటం"లో జయప్రద

## వినయ్ దర్శకత్వంలో "స్త్రీధనం"

"ఇంగెయుం ఒరు గంగై- అనే తమిళ చిత్రం ఆధారం. రాజమండ్రి ప్రాంతాల్లో నెల రోజుల పాటు జరిగే ఒకే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు వినయ్ (అక్కినేని వినయకుమార్). ఈయన దాసరి నారాయణరావు వద్ద తొమ్మిదేళ్ళుగా పలు చిత్రాలకు పని చేశారు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో బి.ఆర్.మోహన్, కె. విశ్వనాథం నిర్మించే శ్రీ విజయలక్ష్మి ఆర్ట్ క్రియేషన్స్ "స్త్రీధనం" చిత్రంలో చంద్రమోహన్, భానుప్రియ, రాజేంద్రప్రసాద్, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, నూతన్ ప్రసాద్, రాళ్ళపల్లి, వేలు, అన్నపూర్ణ, జయమాలిని వగైరా నటవర్గం. కళైమణి కథ, సత్యానంద్ సంభాషణలు, వేటూరి గీతాలు, కృష్ణ - చక్ర సంగీతం, కె.ఎస్. హరి ఛాయ, నాగేశ్వరరావు- సత్యం కూర్పు, సత్యం నిర్వహణతో కె.ఎల్.ఎన్. సహ నిర్మాత.

## ప్రభాకర రెడ్డి దర్శకత్వం వహించే తొలి చిత్రంలో కృష్ణ

"ఒక తండ్రి ఆదర్శాలను, ఆశయాలను ముగ్గురు కొడుకులు మూడు కోణాలలో ఆచరించడం ప్రధాన ఇతివృత్తం. కృష్ణ సరసన భానుప్రియ నాయికగా నటిస్తున్న మొదటి చిత్రమిది. తండ్రిగా గుమ్మడి, కొడుకులుగా కృష్ణ, శ్రీధర్, ప్రసాద్‌బాబు నటిస్తారు," అన్నారు డాక్టర్ ఎం. ప్రభాకర రెడ్డి. ఈయన కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చి తొలిసారిగా దర్శకత్వం వహించే ఎస్.ఆర్. ఫిలిమ్స్ వారి చిత్రంలో ఈయనతో పాటు అల్లు రామలింగయ్య, వేలు, షావుకారు జానకి, అన్నపూర్ణ, సంగీత, కె. విజయ, సంయుక్త తదితరులు పాత్రధారులు. నవంబర్ 18వ తొలిగీతం ధ్వని ముద్రితమైంది. మద్దిపట్ల సూరి సంభాషణల కర్త. సత్యం స్వరకల్పనలో వేటూరి, గోపి గీతాలు రాశారు. పుష్పాల గోపీకృష్ణ ఛాయ,

# శేషాలు

## డిసెంబర్ 25న "ఎఱ్ఱమట్టి"

సాధారణంగా మాదాల రంగారావు చిత్రాలను సెన్సార్ వారు భూతద్దంతో చూస్తారు. కాని, ఈయన కథ, నిర్మాణ సారథ్యం వహించిన నవతరం పిక్చర్స్ "ఎఱ్ఱమట్టి" అభ్యుదయ చిత్రం కేవలం రెండు చిన్న కట్స్‌తో "ఎ" సర్టిఫికేట్ పొంది, సునాయాసంగా బయట పడింది. ఇటీవల న్యూఢిల్లీలో దక్షిణ భారత నటీనట సమాఖ్య ఆధ్వర్యంలో ఏర్పాటు చేయబడిన ప్రీమియర్ ప్రదర్శన బహుముఖ ప్రశంస లందుకుంది. విప్లవం అంటే ఏమిటో తెలియని పాలేరుగా మాదాల నినాదాలు, సందేశాలు పల్కని పాత్రలో అద్వితీయంగా నటించారు. అయన్ని విప్లవమూర్తిగా సంస్కరించే పాత్రను రూప నిర్వహించింది. పతాక సన్నివేశం కూడా మాదాల చిత్రాలకు భిన్నంగా ఉంది. తొలిసారి ఏరియాల విక్రయం జరిగిన ఈ మాదాల చిత్రాన్ని మన రాష్ట్రంలో సాగుతున్న భూపోరాటోద్యమం తరుణాన గీతావాణి ఫిలిమ్స్ విడుదల చేస్తోంది. వీరభద్రరావు, జె. పి. గరగ, కృష్ణమూర్తి, ఎం.వి. ప్రసాద్, శివరంజని, లక్ష్మీప్రియ, ఎం.బి. కోటేశ్వరరావు, ఒక కీలకమైన పాత్రలో ప్రభాకరరెడ్డి నటించారు. ఎం. జి. రామారావు సంభాషణల కర్త. పార్థసారధి స్వరకల్పనలో కొసరాజు, ధవళ సత్యం గీతాలు రాశారు. ఆర్. రామారావు ఛాయ, మణి ప్రొడక్షన్, చేదుల సుబ్బారావు కూర్పుతో ధవళ సత్యం దర్శకుడు.





రామ్ సూరి– గౌరసత్యం సహ దర్శకత్వం, కోటగిరి గోపాలరావు కూర్పు, ఎస్. వెంకటేశ్వరరావు నిర్వహణతో ఈ చిత్రాన్ని నిర్మించే శాఖమూరి రామచంద్రరావు "డిసెంబర్ 21 నుంచి పద్మాలయ స్టూడియోలో చిత్రీకరణ మొదలవుతుంది. మరో రెండు షెడ్యూల్స్‌తో ఫిబ్రవరికి పూర్తవుతుంది." అని తెలిపారు.



"ఖైదీరాణి"లో సిల్క్‌స్మిత

## "ఖైదీరాణి" రెండవ షెడ్యూల్

"ప్రతీకారం తీర్చుకునే పాత్రను స్మిత, జైలర్ పాత్రను శరత్‌బాబు, నాయకుడుగా "మయూరి" శుభాకర్, ప్రతి నాయకులుగా సుధాకర్, వినోద్, రవికిరణ్, కమలాకర్ నటిస్తున్నారు. నవంబర్ 15 నుంచి నెలాఖరు వరకు మొదటి షెడ్యూల్ పూర్తయింది. రెండవ షెడ్యూల్ డిసెంబర్ 25 నుంచి 31 వరకు. తతిమ్మా షూటింగ్ జనవరి 8 నుంచి." అన్నారు కె.ఎస్.ఆర్. దాస్. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పింజల ఆనందరావు సమర్పించే లక్ష్మి ఇంటర్నేషనల్ ఫిలిమ్స్ వారి "ఖైదీరాణి" చిత్రంలో జగ్గయ్య, కాంచన, రాజ్యలక్ష్మి, ప్రమీల, అన్నపూర్ణ, అనూరాధ, హీరా, హరిప్రియ ఇతర పాత్రధారులు. సత్యానంద్ మాటలు, రాజశ్రీ పాటలు, సత్యం సంగీతం, లక్ష్మణ్‌గోరే ఛాయ, కృష్ణ శిల్పం, తార నృత్యాలు, బండ్రెడ్డి నరసింహారావు సహ దర్శకత్వం, మోహన్ కూర్పుతో లక్ష్మి నిర్మాత.



మావారు ఓ చిత్రంలో ఒక్క సెకను నటించారు. ఆఫిలిం ముక్క ఒక్కటే తెచ్చుకున్నారు!

## శ్రీనివాసా ప్రొడక్షన్ కొత్త చిత్రంలో విజయబాపినీడు దర్శకత్వంలో అర్జున్

"అర్జున్ సరసన పూర్ణిమ నాయిక," అన్నారు విజయబాపినీడు. ఈయన దర్శకత్వంలో "కృష్ణగారడి" అనంతరం ఫిబ్రవరి నుంచి శ్రీనివాసా ప్రొడక్షన్స్ నిర్మించే చిత్రానికి అట్లూరి రాధాకృష్ణమూర్తి, కొమ్మన నారాయణరావు నిర్మాతలు.

నందిగం దేవీప్రసాద్

సమర్పించు

రాంప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్

# అనాదిగా ఆడది

ఎస్.రామలింగేశ్వరరావు

అనిల్ కుమార్




Bhaskar

"కుట్ర"లో అర్జున్, డిస్కో శాంతి



## కె. ఎస్. ఆర్., పి. ఎన్. ఆర్.ల "కుట్ర" చివరి షెడ్యూల్

"కన్న ప్రేమకు, పెంచిన ప్రేమకు మధ్య నలిగే క్లిష్టమైన పాత్రలో యాక్షన్ కింగ్ అర్జున్, కన్నబిడ్డను ఉరికంబమెక్కించిన పాత్రలో జయంతి అపూర్వంగా నటిస్తున్నారు. ఒక ఫ్యాక్టరీ యజమానురాలు జయంతి. ఆ ఫ్యాక్టరీకి డైరెక్టర్ ఆమె అన్న సుదర్శన్. ఆ ఫ్యాక్టరీలో ఒక బాధ్యతగల పదవికి తర్ఫీదు పొందుతున్న యువకుడు అర్జున్. అతని ప్రేయసి జయంతి మేనకోడలైన మహాలక్ష్మి. విలక్షణమైన పాత్రలతో సెంటిమెంట్, యాక్షన్ ప్రధానంగా గల రసవత్తరమైన కథను భీశెట్టి లక్ష్మణరావు సమకూర్చారు. నవంబర్ 15కి మొదటి షెడ్యూల్‌ను ముగించాం. ఆఖరి షెడ్యూల్ డిసెంబర్ 1 నుంచి 12 వరకు." అన్నారు కె. ఎస్. ఆర్ దాస్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే పి. ఎన్. ఆర్. పిక్చర్స్ "కుట్ర" చిత్రంలో సుధాకర్, త్యాగరాజు, పూర్ణిమ, సిల్క్ స్మిత, అనూరాధ, డిస్కో శాంతి తతిమ్మా నటవర్గం. సాయినాథ్ మాటలు, సత్యం సంగీతం, ఆర్. మధుసూదన్ ఛాయ, ఎం. కృష్ణ శిల్పం, కె. రామమోహనరావు కూర్పు, కె. రంగారావు సహ దర్శకత్వం, ఎన్. వెంకటేశ్వరరావు నిర్వహణతో పింజల నాగేశ్వరరావు నిర్మాత.



"మేనమామ"లో కళ్యాణచక్రవర్తి, రజని

## "కుట్ర" లో ఖూనీ

వైజయంతీదేవి (జయంతి)కి రఘుదేవపురం ఎస్. ఐ. ఫోన్ చేసి, "సారీ, మేడమ్! మీ అబ్బాయి సుధాకర్ హత్య చేయబడ్డాడు..... ఇంకొద్ది సేపట్లో శవాన్ని మీ ఇంటికి పంపుతాం" అని ఫోన్ చేయగానే వైజయంతీదేవి మొదలు నరికిన మ్రానులా నేల కూలింది. అర్జున్, త్యాగు, సుదర్శన్, లావణ్య ఊరడించారు. కాస్సేపటికి తేరుకున్న వైజయంతీదేవి ఆవేశంతో "నాబిడ్డను ఎవరో హత్య చేశారు. నన్ను చంపలేని కసితో ఆ దుర్మార్గులు నా బాబును పొట్టన పెట్టుకున్నారు. నా బిడ్డ హత్యకు నేను పగ తీర్చుకోవాలి.... చెప్పు అర్జున్! నిర్దాక్షిణ్యంగా నా బిడ్డను చంపిన ఆ ఖూనీకోర్‌లు ఎవరో ఊడ్చుకొస్తానని చెప్పు. ఇంకా ఆలోచిస్తావేం? మాటివ్వు, అర్జున్!" అంది.

"మాతృదేవోభవా- అన్నారు. కన్న తల్లి మీద ప్రమాణం చేసి చెప్తున్నా. మీ బాబును చంపిన ఆ హంతకులను మీ కాళ్ళ ముందు పడేసే బాధ్యత నాది" అన్నాడు అర్జున్.

కాస్సేపటికి పోలీసులు, శవాన్ని తీసుకొచ్చి అప్పగించారు. వైజయంతీదేవి భోరున విలపిస్తూ, "వీడే బాబూ నా సర్వస్వం.... అర్జున్! పది నిమిషాల క్రితం ఈ సుధాకర్‌ని నీకు పరిచయం చెయ్యాలనుకున్నాను. నా ప్రాణాలు రక్షించిన దాతగా వీడికి నీ గురించి చెప్పాలనుకున్నాను. ఇప్పుడు వీడు నా మాట వినే స్థితిలో లేడు, బాబూ!" అంటూ లేచి, "ఎవరు నా బిడ్డను చంపారు, ఇన్‌స్పెక్టర్?" అని అడిగింది.

"రఘుదేవపురం గెస్ట్ హౌస్‌లో హత్య జరిగిందని మాకు ఫోన్ వచ్చింది. వెంటనే బయలుదేరి వెళ్లాం.

# సినిమా

అప్పటికే హంతకుడు పారిపోతున్నాడు. కుర్రాడే. మీ బాబు వయసే. అతన్ని పట్టుకోవాలని వెంట పడ్డాం. కాని, తెగించి తెలివిగా తప్పించుకున్నాడు. అతని కోటు మాకు దొరికింది!" అంటూ ఎస్.ఐ. ఓ కోటు చూపించాడు. లావణ్య కంగారుతో ఆ కోటు కాలర్‌ను చూసింది. దాని మీద "ఎల్" అని తాను ఎంబ్రాయిడరి చేసిన అక్షరం కనిపించగానే నిర్ఘాంతపోతూ, అర్జున్ వంక చూసింది అర్జున్ చకితుడయ్యాడు.

కె. ఎస్.ఆర్. దాస్ దర్శకత్వంలో పింజల నాగేశ్వరరావు నిర్మించిన పి ఎన్.ఆర్. పిక్చర్స్ "కుట్ర" చిత్రం త్వరలో విడుదలవుతుంది.

## జంధ్యాల – చిరంజీవి, సుహాసినిలతో భీమవరపు బుచ్చిరెడ్డి చిత్రం

"జనవరిలో పాటల రికార్డింగ్. ఫిబ్రవరి 11న షూటింగ్ ముహూర్తం," అన్నారు జ్యోతి ఆర్ట్ పిక్చర్స్ అధినేత భీమవరపు బుచ్చిరెడ్డి. ఈయన చిత్రంలో చిరంజీవి, సుహాసిని నాయికా నాయికలు. చక్రవర్తి సంగీతం, గౌతంరాజు కూర్పుతో జంధ్యాల రచన, దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు

## "బండరాముడు"

"పగిలిన గాజుల పగతో రగిలిన ఓ యువకుడి ప్రతీకారజ్వాల- మూలకథాంశం," అన్నారు రవీంద్రబాబు ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో దర్శిరామ్మోహనరావు, మండవ వెంకట్రావు నిర్మించే లక్ష్మీగణపతి మూవీస్ "బండరాముడు" చిత్రానికి డిసెంబర్‌లో పాటలు రికార్డవుతాయి జనవరి 1 నుంచి రెండు షెడ్యూల్స్‌లో చిత్రీకరణ ముగుస్తుంది రామకృష్ణ హెగ్డే, ఆనందబాబు, సత్యనారాయణ, కె ఆర్. విజయ, అర్చన, మంజు, వేలు, రాళ్ళపల్లి, శ్రీలక్ష్మి, ఎ.ఆర్ వరలక్ష్మి వగైరా నటవర్గం. కొంపెల్ల విశ్వం సంభాషణల కర్త. ఆత్రేయ, వేటూరి గీతాలకు వి.ఎస్ నర్సింహన్ స్వరకర్త

**(65వ పేజీ చూడండి)**

"కుట్ర"లో అర్జున్, జయంతి








SERIES

సీరియల్

# నీడలు-నిజాలు

## విన్నకోట సుశీలాదేవి

(గత సంచిక తరువాయి)

ఉదయం ఏడుగంటల వేళ. డైనింగ్ టేబిల్ మీద ప్లేట్లలో ఫలహారం సర్దుతున్న లక్ష్మీదేవి దగ్గరి కొచ్చింది శారద.

"అత్తయ్యా! నేనివాళ మా వూరికి వెడుతున్నాను!" అంది.

లక్ష్మీదేవి తలెత్తి శారద ముఖంలోకి చూసింది. శారద ముఖం వుబ్బి వుంది. కళ్ళు ఎర్రగా జ్యోతుల్లా వున్నాయి.

ఆ స్థితిలో వున్న శారదని చూడగానే లక్ష్మీదేవి మనస్సు కలుక్కుమంది.

శారద దగ్గరగా వచ్చి తల మీద చెయ్యి వేసి నిమురుతూ –

"శారదా! అప్పుడే వెడతావా! ఇంకొన్ని రోజులు వుండకూడదూ!" అంది.

"లేదత్తయ్యా! వెళ్ళాలి! నాన్న ఒక్కరే ఇబ్బంది పడుతుంటారు. ఇక్కడ నా అవసరం తీరిపోయిందిగా."

ఆ మాటతో లక్ష్మీదేవి గుండె పట్టినట్లయింది. శారదకి జరిగిందంతా తెలిసిపోయిందా! అని అనుమాన పడింది.

"శారదా! అలా వున్నావే తల్లీ!" అసలు విషయం తెలుసుకోవాలనే వుద్దేశంతో అడిగింది! అనునయంగా ఆ చల్లని మాటకు శారద కళ్ళు మేఘాల్లా వర్షించాయి. దుఃఖం ఆపుకోలేక లక్ష్మీదేవి బుజం మీద తలపెట్టి వెక్కి వెక్కి ఏడ్చింది శారద!

"అత్తయ్యా! నేను బావ నీతో అన్నదంతా విన్నాను!" అంది. ఆ మాటతో కంగారు పడిపోయింది లక్ష్మీదేవి.

"శారదా!"

శారద ముఖం కొంగుతో తుడుచుకుంది.

జరిగినకథ – 5: రవికి, శారదకి పెళ్ళి చేయాలనుకుంటారు పెద్దలు. రవి దుడుకుతనం వల్ల కాగే కాగే నూనె శారద ముఖంపై చేతులపై చింది ఆమె శరిరం అంద వికారమయిపోతుంది. అయినా రవికి శారదపై ప్రేమ తగ్గలేదు. రవి యూనివర్సిటీలో ఎం. కామ్. చేరుతాడు. అక్కడ జరిగిన ఒక సంఘటన అతని జీవితాన్ని ఒక కొత్త మలుపు తిప్పింది. రవికి సునీత పరిచయం అయ్యింది. అతను శారదను వివాహం చేసుకోనని ఇంట్లో చెప్పేస్తాడు – మేనకోడల్ని చూచిన లక్ష్మీదేవికి ప్రాణం లేచి వచ్చినట్లయింది. రవికి ఏక్సిడెంట్ వల్ల కంటి చూపు పోయింది. అతను పూర్తి ఆరోగ్యవంతుడయిన తరువాత ఆపరేషన్ చేస్తే చూపు వచ్చే అవకాశం ఉందని డాక్టరు చెపుతాడు. రవికి శారద సేవలు చేయడం మొదలు పెట్టింది. మళ్ళీ వాళ్ళిద్దరు దగ్గరయ్యారు. రవికి ఆపరేషన్ చేస్తే చూపు వచ్చింది. అందరికి చెప్పలేని ఆనందమయింది. రవి యూనివర్సిటీ మిత్రులు వచ్చి అతనిని యూనియన్ ప్రెసిడెంట్‌గా పోటీ చేయమని బలవంతం చేస్తారు. రవి అంగికరిస్తాడు. చూపు వచ్చిన రవి మళ్ళీ మారిపోసాగాడు. తను సునీతను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నట్లు తల్లితో చెపుతాడు. ఈ విషయం శారదను ఎంత కృంగదిస్తుందో అని లక్ష్మీదేవి బాధ పడుతుంది.

"అత్తయ్యా! దానికి నేనేం బాధపడటం లేదు. బావ సుఖంగా వుండటమే నాకు కావలసింది! నేనిక ఇక్కడ వుండలేను! తొమ్మిది గంటల ట్రయిన్‌లో వెళ్ళిపోతాను."

లక్ష్మీదేవికి ఏం చెప్పాలో తోచలేదు!

నీ ఇష్టం శారదా" అని వూరుకుంది! శారద తన గదిలో కెళ్ళి సూట్‌కేస్ సర్దుకుంది. మరో అరగంటకి సూట్‌కేస్ పుచ్చుకుని బయటకు వచ్చింది. లక్ష్మీదేవి బలవంతం మీద టిఫిను, కాఫీ తీసుకుంది!

"ఇక నేను వెడతానత్తయ్యా!" అంది! రాఘవయ్య వుదయమే లేచి బొంబే వెళ్ళిపోయాడు! రవి రాత్రి సెకండ్ షోకి వెళ్ళి రావడం వలన ఇంకా నిద్ర లేవలేదు.

"అత్తయ్యా! మావయ్యతో – బావతో చెప్పు!" అంది శారద. దుఃఖం అతికష్టం మీద ఆపుకుంటోంది.

"లక్ష్మీదేవి శారదని దగ్గరకు తీసుకుంది! "శారదా! నీ అత్తయ్య ఒట్టి అశక్తురాలమ్మా! ఈ అత్తయ్యని క్షమించు తల్లీ!" అంది.

"ఛ! అదేమిటత్తయ్యా! ఇందులో నువ్వు చేసిందేముంది? ఇదంతా నా దురదృష్టం! అంతే" అంది.

"లేదు శారదా! నీ వంటి రత్నాన్ని కోడలుగా చేసుకో లేకపోతున్న నాదమ్మా దురదృష్టం" లక్ష్మీదేవి కంటి నుండి నీటిబొట్లు జారి శారద తల మీద పడి జుట్టులో పడి ఇంకిపోతున్నాయి! శారద ఇక అక్కడ ఎక్కువ సేపు వుండలేకపోయింది. దుఃఖంతో స్పృహ తప్పేట్లు వుంది!

"వెళ్ళొస్తానత్తయ్యా! టైమవుతోంది" అని తప్పించుకుంది. "జాగ్రత్తగా వెళ్ళు శారదా! ఇంటికి చేరగానే వుత్తరం వ్రాయి!"

"అలాగే" అంటూ వెళ్ళి కారులో కూర్చుంది! కారు గేటు దాటుతుండగా శారద ఒకసారి వెనుదిరిగి ఆ మేడ వేపు చూసింది.

ఈ రోజుతో ఈ ఇంటికీ – తనకూ ఋణం తీరిపోయింది. ఇక ఈ జన్మలో ఇంటికి రాదు.

దాదాపు మూడు నెలల క్రితం – బావకి కళ్ళు పోయాయని తెలిసిన రోజున ఈ ఇంట్లోకి అడుగు పెట్టింది. ఆ రోజున తనకు ఎటువంటి కోర్కెలు – ఆశలు లేవు. కేవలం అత్తయ్యని ఓదార్చాలని బావని ఒకసారి చూసి వెళ్ళాలని వచ్చింది.

కానీ ఆ తర్వాత అనుకోని విధంగా మాయాజాలంతో చిక్కుకుపోయింది. సాలెగూడులో చిక్కిన ఈగలా కోర్కెల సుడిగుండంలో మునిగి కొన్నాళ్ళపాటు ఈ ప్రపంచాన్నే మరిచిపోయింది! వూహల వుయ్యాలలో ఊగిసలాడింది.

చివరకి నాడు కలలన్నీ కల్లలు కాగా తీరని వ్యధతో తిరిగి వెడుతోంది.

ఒకప్పుడు బావ తనని తిరస్కరించాడని తెలిసి ఆత్మహత్య చేసుకోవాలనే ఆలోచనతో వేగిపోయింది కానీ ఇప్పుడటువంటి పిచ్చి పనులు చెయ్యదు.

బావలాటి మూర్ఖుడి కోసం తన జీవితాన్ని ఎందుకు నాశనం చేసుకోవాలి!

అమూల్యమైన ఈ జీవితానికి ఒక లక్ష్యం, గమ్యం ఏర్పాటు చేసుకుని – జీవితాన్ని సార్థకం చేసుకోవాలి. అలా చేసుకుంటుంది కూడా.

"రేపటి నుండే నేను కొత్త జీవితాన్ని ప్రారంభిస్తాను."

అలా నిర్ణయం చేసుకోగానే శారద మనస్సు తేలిక పడింది!

★ ★ ★ ★ ★

వుత్తరం గానీ, వర్తమానం గానీ లేకుండా హఠాత్తుగా వూడిపడిన కూతుర్ని చూసి ఆశ్చర్యపోయాడు వెంకట్రామయ్య.

"ఏమిటమ్మా! ఇలా హఠాత్తుగా వచ్చావ్! ముందుగా రాస్తే స్టేషన్‌కి బండి తెచ్చేవాడిని కదా" అన్నాడాయన.

"ఏం లేదు నాన్నా. నిన్ను చూసి చాలా కాలమైంది కదా! అందుకని వచ్చేశాను."

సూట్‌కేస్ గదిలో పెట్టింది. వంటింట్లోకి వచ్చి కూజాలోని నీళ్ళు వంపుకుని తాగింది.

వెంకట్రామయ్యకి కూతురి మాటలు నమ్మబుద్ధి కాలేదు. ఇప్పుడప్పుడే రానని వుత్తరం వ్రాసిన కూతురు ఇంత హఠాత్తుగా వచ్చిందంటే ఏదో కారణం వుండి వుంటుంది. బహుశా అక్కడేదైనా గొడవ జరిగిందేమో. అదేదో నెమ్మదిగా అడిగి తెలుసుకోవాలి" అనుకున్నాడు.

ఆ రాత్రి భోజనాలయ్యాక ఆరుబయట మంచాలు వేసుకున్నారు తండ్రీ కూతుళ్ళు.

వెంకట్రామయ్య తన మంచం మీద పడుకుని శారదని చూస్తూ –

"శారదా రేపు మీ అత్తయ్యకు వుత్తరం రాయాలనుకుంటున్నాను" అన్నాడు.

మంచంమీద పడుకుని ఆకాశంలోని నక్షత్రాలను చూస్తోంది శారద! తండ్రి మాటలు విని తల త్రిప్పకుండానే –

"ఏమని వ్రాస్తావు నాన్నా" అనడిగింది. "వచ్చే నెలలో రెండు ముహూర్తాలున్నాయి. ఏదో ఒకటి నిశ్చయం చెయ్యమంటాను."

శారద దిగ్గున లేచింది.

"వద్దు నాన్నా! బావని నేను చేసుకోను." అంది శారద కంగారు పడిపోతూ.

ఆయన తెల్లబోయాడు.

"రవిని చేసుకోవా? ఎందుకని?"

శారద క్షణకాలం మాట్లాడలేదు. ఆతర్వాత నెమ్మదిగా అంది "ఏం లేదు నాన్నా! నాకిష్టం లేదు! అంతే"

కానీ వెంకట్రామయ్య నమ్మలేదు. ఆయన కేదో అనుమానం కలిగింది. రవి అంటే ప్రాణం ఇచ్చే శారద ఇలా అంటోందంటే ఏదో జరిగి వుంటుంది. అదేమై వుంటుంది? అసలు నిజాన్ని తెలుసుకోవాలని ఆరాటపడ్డాడు!

"శారదా! రేపు మీ అత్తయ్య దగ్గరికొకసారి వెడతాను! అసలు విషయమేమిటో తెలుసుకొస్తాను." అన్నాడు. ఆమె ముఖంలోకి సూటిగా చూస్తూ.

"వద్దు నాన్నా! వెళ్ళొద్దు" శారద తడబడిపోయింది.

"ఎందుకని తల్లీ!"

శారద సమాధానం చెప్పలేదు. వెంకట్రామయ్య లేచి శారద ప్రక్కన కూర్చున్నాడు.

"శారదా! రవి చేసుకోనన్నాడు కదూ!"

"నాన్నా" బేలగా అంది.

"ఎందకమ్మా! నా దగ్గర దాస్తావు? శారదా! నిన్ను చిన్నప్పట్నించీ అల్లారుముద్దుగా పెంచాను తల్లీ! నీకెటువంటి కష్టమూ రాకూడదని – నీ



జీవితమంతా హాయిగా సాగిపోవాలని. నా రక్తాన్ని చెమటగా మార్చి ఇంత పొలాన్ని సంపాదించాను. నీకు సవతితల్లి బాధ వుండకూడదని – పెళ్ళి చేసుకోవడం మానుకున్నాను. నీ సుఖమే నా సుఖమని. నీ ఆనందమే నా ఆనందమని భావిస్తూ – ప్రాణాలన్నీ నీ మీదే పెట్టుకుని బ్రతుకుతున్నాను. నువ్వు కంటతడి పెడితే నేను చూడలేనమ్మా! చెప్పు తల్లీ! ఏం జరిగింది? నా దగ్గర బిడియమెందుకమ్మా! నీకు తల్లీతండ్రీ నేనే కదమ్మా!"

"నాన్నా! రవి ఇంకో అమ్మాయిని చేసుకోబోతున్నాడు" అంది నెమ్మదిగా.

ఆ మాటకి తండ్రి ఎగిరి పడతాడనుకుంది. రవిని తిట్టి పోస్తాడనుకుంది. కానీ వెంకట్రామయ్య చాలా ప్రశాంతంగా కూర్చున్నాడు.

"శారదా! ఇలా జరుగుతుందని నాకు ముందే తెలుసమ్మా. ఆనాడే నిన్ను హెచ్చరించాను. కానీ నువ్వు నా మాట వినలేదు."

శారద మౌనంగా వుండిపోయింది.

పోనీ తల్లీ జరిగింది మర్చిపో: నీకేం తక్కువ ఆస్తి వుంది. డబ్బు వుంది. మంచి సంబంధం చూసి రవి పెళ్ళి కంటె నీ పెళ్ళి ముందు చేస్తాను. ప్రతిజ్ఞ చేశాడు.

శారద మాట్లాడలేదు.

"శారదా! నేనున్నంత వరకూ నీకే బాధా వుండదు తల్లీ! నిశ్చింతగా పడుకో! ఆ స్వార్థపరుడు – చంచల మనస్కుడు నిన్ను చేసుకోనందుకు సంతోషించు. నిన్ను పెళ్ళి చేసుకున్నా ఏదో కారణాన నిన్ను హింసిస్తూనే వుంటాడు. ఆ దేవుడు నీకా బాధ తప్పించాడు.

నీ అదృష్టం బాగుండబట్టి వాడితో నీ పెళ్ళి జరగలేదు. ఇప్పటికైనా కళ్ళు తెరిచి వాస్తవాన్ని గ్రహించమ్మా! గతానికి తెర దింపి భవిష్యత్తుకు తలుపులు తెరువు! నీ జీవితాన్ని ఆనందమయం చేసుకో తల్లీ! ఆలోచించు శారదా! నువ్వు చదువుకున్న దానివి" అనేసి తన మంచం మీదకు వెళ్ళి పడుకున్నాడు వెంకట్రామయ్య.

శారద కళ్ళు మూసుకుని పడుకుంది. శారద ఆలోచించడం లేదు. తనిప్పుడు దేవుడి చేతిలోని మైనపు ముద్దలాటిది! ఆయన ఎలా తీరిస్తే ఆ విధంగా మారుతుంది. లభించిన అవకాశాన్ని ఉపయోగించుకుంటుంది. జీవితాన్ని ఆనందమయం చేసుకుంటుంది!

మూసుకున్న కనురెప్పలపై నిద్రాదేవి మెల్లగా వాలి – శారదని తనలోకి తీసుకోసాగింది!

★ ★ ★ ★ ★

యూనివర్సిటీ ఎలక్షన్ల ప్రచారం ముమ్మరంగా సాగుతోంది. యూనివర్సిటీ గోడలన్నీ నినాదాలతోను, కాంపస్ అంతా మీటింగ్‌లతోనూ నిండి పోయాయి. ఏ ఇద్దరు ఎదురు పడినా ఎలక్షన్ల చర్చలే! కరపత్రాలు పూలజల్లులా అందరి నెత్తి మీద అప్పుడప్పుడు జలజలా రాలి పడుతున్నాయి. రవి వర్గం వారూ, గోపాల్ అనుచరులూ మిగిలిన విద్యార్థులకు విందులు – వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేస్తున్నారు. ఎలక్షన్ల మూలంగా యూనివర్సిటీకి శెలవులు ప్రకటించారు. ఎలక్షన్లు నాలుగు రోజుల్లో జరగబోతున్నాయి.




రవికి చాలా ఆందోళనగా వుంది. ఈ ఎలక్షన్ల మీదే తన గౌరవమర్యాదలు ఆధారపడి వున్నాయి! ఈ ఎలక్షన్లలో ఓడిపోతే ఇక తను తలెత్తుకు తిరగలేడు! ఎలాగైనా గెలవాలి. గెలిచి తీరాలి!

ఆలోచిస్తూ నడుస్తున్న రవికి సునీత ఎదురు పడింది.

"హల్లో రవీ! ఒక్కడివే వస్తున్నావే? నీ అనుచరులేరి."

"వెనక వున్నారులే! నీతో మాట్లాడాలి అలా చెట్టు క్రింద కూర్చుందాం రా!" అన్నాడు రవి. ఇద్దరూ వెళ్ళి కూర్చున్నారు!

"ఏమిటో చెప్పు రవీ"

"సునీతా నువ్వు లేడీస్ అందరికీ మరోసారి గట్టిగా చెప్పి వాళ్ళ ఓట్లన్నీ మనకు పడేట్లు చూడాలి" అన్నాడు.

"అలాగే కానీ! వుమెన్స్ హాస్టల్ చాలా దూరం రవీ" అంది.

"నా స్కూటర్ మీద వెడదాం రా"

సునీత ముఖం చిట్లించింది.

"ఆ డొక్కు స్కూటర్ మీదనా! నేను రాను బాబూ! రవీ ఒక కారు కొనకూడదూ!" అంది.

రవి నవ్వాడు.

"ఎందుకూ! మన ఎన్నికల ప్రచారానికా?"

"వుహు కాదు. మనం ఝామ్మంటూ తిరగడానికి ఆమెత్తని సీట్లమీద కూర్చుని – ఒకరి చేతుల్లో ఒకరం వాలిపోతూండగా – కారు పూలరథంలా సాగుతుంటే ఎంత బాగుంటుందో తెలుసా" పరవశంగా అంది!

రవి కూడా క్షణకాలం ఆ మాటలకు మైమరచాడు కానీ వెంటనే తేరుకుని –

"సునీతా! నువు చెప్పింది నిజమే. కారు వుంటే బాగుంటుంది! కానీ మానాన్న ప్రస్తుతం కారు కొనడు. కొన్నాళ్ళ వరకూ మనకి స్కూటర్ తప్పదు!" అన్నాడు.

సునీత మూతి ముడిచింది.

"రవీ! ఆ గోపాల్ కారు కొంటున్నాడు."

రవికి చిరాకు కలిగింది.

"వాడు కొంటే మనకేం వాడికి డబ్బుంది కొనుక్కుంటాడు. మనకి డబ్బు వున్నప్పుడు మనమూ కొనుక్కుందాం!"

"అదికాదు రవీ! అతడు కొంటున్నప్పుడు మనం కొనకపోతే ఏం బాగుంటుంది చెప్పు."

సునీత ధోరణికి రవి విసుక్కున్నాడు!

"సునీతా! ప్రస్తుతం మనం ఎలక్షన్లలో గెలవాలి. అది ముఖ్యం. అంతేకానీ కారు కాదు....మనం గెలిచే పద్ధతి ఆలోచించు. నా తరఫున బాగా ప్రచారం చేసి నేను గెలిచేట్లు చూడు!" అన్నాడు.

సునీత సమాధానం చెప్పలేదు! తలొంచుకుని గడ్డి పరకలు పీకి విసిరి వేయసాగింది! సునీతకి కోపం వచ్చిందని గ్రహించి రవి బ్రతిమిలాడటం మొదలెట్టాడు.

"సునీ మైడియర్! నువ్వలా కోపంతో వుంటే ఈ దీనుడి మన సెంత బాధ పడుతుందో తెలుసా! ప్లీజ్ కోపం మానవూ! దానికేం లంచం కావాలో చెప్పు ఇస్తాను" అన్నాడు.

"అయితే ఇవాళంతా నాతో తిరగాలి. ముందు మ్యాట్నీకి ఆ తర్వాత హోటల్లో భోజనం – పార్కులో షైరు....."

"సారి సునీతా! నా వల్లకాదు. ఎలక్షన్లు అయ్యేవరకూ ప్రతిక్షణం నాకెంతో విలువైంది. ప్రస్తుతం వేనెక్కడికీ రాను! ఎలక్షన్లయ్యాక ఇక నీ ఇష్టం."

# కాలితే ఏం చేయాలో మా అమ్మకు బాగా తెలుసు.




## తనకి అమ్మమ్మ నేర్పిందిట.

అబ్బ, అమ్మంటే మా అమ్మలా ఉండాలి. ఎంత బాగా చూసుకుంటుందని! అమ్మ మొన్న నా బుజ్జి బొమ్మ గౌను ఇస్త్రీ చేస్తుంటే పొరబాట్న నేను చెయ్యి పెట్టాను. వేలు కాలింది. గబగబా అమ్మ బర్నాల్ రాసింది, కాలితే అమ్మమ్మ కూడా అలాగే బర్నాల్ రాసేదిట.

నా బుజ్జి పాపా, నీకెప్పుడైనా కాలిందంటే నేనూ బర్నాల్ రాస్తాలే, బాగయిపోతుంది.

కదమ్మా! కదూ బర్నాల్!

# బర్నాల్

ఇంటింటా విశ్వసింపబడినది.

BL 2078

అన్నాడు రవి!

"గోపాల్ హాయిగా సినిమాలకు తిరగడం లేదూ." అంది.

సునీత ప్రతి విషయంలోనూ తనను గోపాల్‌తో పోల్చడం రవికి చాలా బాధ కలిగించింది! కానీ సునీతపై కోపగించుకోలేక పోయాడు.

"సునీ! ప్లీజ్! ఈ ఎలక్షన్ల గొడవ అయిపోయి నేను గెలవనీ. ఆతర్వాత నువ్వెక్కడికి రమ్మంటే అక్కడికి వస్తాను" అన్నాడు ఆమె బుజం మీద చెయ్యి వేసి.

సునీత చెయ్యి తీసేసి చటుక్కున లేచి వెళ్ళిపోయింది! సునీత అలా ప్రవర్తిస్తుందని వూహించని రవి బిత్తరపోయాడు. సునీత వెళ్ళిన వేపే దిగ్భ్రాంతితో చూస్తూ వుండిపోయాడు! చాలా సేపటికి తేరుకుని చిన్నగా నిట్టూర్చాడు!

సునీత అంత హఠాత్తుగా ఎందుకు వెళ్ళిపోయింది? ఆమె కంత కోపం అసలు ఎంద ం వచ్చిందో? బహుశ తను సినిమాకి రానందుకా? తనకు మాత్రం సునీతతో తిరగాలని లేదా? కానీ ఈ ఎలక్షన్లు అయ్యేవరకూ తన మనస్సు నిమితరగా వుం కటంలేదు. ఎలక్షన్లు అయిపోయి తను గెలిస్తే....ఆ తర్వాత తనూ సునీత దేశమంతా చుట్టి రావచ్చు! సునీత ఎంత చెప్పినా అర్థం చేసుకోదు. పైగా ఆ గోపాల్‌ని తన ముందే పొగుడుతోంది! ఎందుకిలా మారింది. ఒకవేళ సునీతకి తన మీద ప్రేమ తగ్గిపోయిందా?

కానీ వెంటనే తనకి తాను సర్ది చెప్పుకున్నాడు. "ఛ! అలా ఎన్నటికీ జరగదు. సునీతకి తనంటే చాలా ప్రేమ. కోపాలు – విరహ తాపాలు ప్రేమికుల మధ్య సహజం. సునీత కోపం తాటాకు మంటలాటిది. తను వెళ్ళి బ్రతిమిలాడితే ఇట్టే తగ్గిపోతుంది!

లేచి వెళ్ళి బ్రతిమిలాడి ఆమెని ఆనందపరచాలి అనుకుంటుండగా ప్రసాద్ రవి దగ్గరకు వచ్చాడు.

"రవీ! నువ్విక్కడ వున్నావా! నీ కోసం అంతా గాలిస్తున్నాను." అన్నాడు.

"ఏమిటి విశేషం."

"అర్జంటుగా అయిదొందలు కావాలిరా." అనడిగాడు.

రవి ఆశ్చర్యపోతూ "అయిదొందలా! మొన్ననే కదరా వెయ్యి రూపాయలు పట్టుకెళ్ళావ్! ఇక మళ్ళీ డబ్బులు అడగనని కూడా చెప్పావ్." అన్నాడు.

"అవున్రా! అప్పుడలాగే అనుకున్నాను! అందుకే చెప్పాను. కానీ మళ్ళీ డబ్బు అవసరం వచ్చింది. నీ దగ్గరకు వచ్చాను." అన్నాడు నిర్లక్ష్యంగా తల ఎగరేస్తూ!

రవి కోపాన్ని అణచుకున్నాడు.

"అంత అవసరం ఏమొచ్చింది?" అనడిగాడు.

"అదేం ప్రశ్న! ఎలక్షన్ కాన్వాసింగ్‌కి....!"

"ప్రచారం అయిపోయిందిగా!"




"ఇంకా ఎక్కడయిందిరా! స్టూడెంట్స్ కొందరు డిన్నరడిగారు. ఖుషి ఖుషీగా డిన్నరు పార్టీ ఏర్పాటు చెయ్యాలంటే అయిదొందలన్నా వుండొద్దా!" అన్నాడు ప్రసాద్.

రవి విసుక్కున్నాడు.

"ఎన్ని డిన్నర్లు, ఎన్ని పార్టీలిస్తాంరా! దినికేమి అంతులేదా?"

"ఒరేయ్ చిట్టితండ్రీ! ఇలా డబ్బుకు మొహం చూసుకునే వాడు అసలు ఎలక్షన్లలో దిగకూడదు. తెలిసిందా. దిగాక ఇలా ప్రతీ విషయానికి పదిసార్లు ఆలోచించకూడదు. ఆ గోపాల్‌గాడు ఎంత ఖర్చు పెడుతున్నాడో తెలుసా! నువ్వు చివరి దశలో ఇలా వెనకడుగు వేస్తే ఆ గోపాల్‌గాడే గెలుస్తాడు!! ఇక మనం నెత్తి మీద బట్ట వేసుకుని పోవాల్సిందే." అన్నాడు ప్రసాద్.

ఆ చివరి మాట రవి మీద బాగా పని చేసింది. వెంటనే లేచాడు!

"పద! ఇంటి కెడదాం. డబ్బిస్తాను." అని ముందుకు నడిచాడు.

★ ★ ★ ★ ★

ఇద్దరూ స్కూటర్ మీద రవి ఇంటికి వచ్చారు! రవి లోపలికెళ్ళి అయిదొందలు తీసుకొచ్చి ప్రసాద్ కిచ్చాడు.

ప్రసాద్ సంతోషంతో – "థాంక్యూ – రవీ! ఇక నిన్ను డబ్బు కోసం బాధ పెట్టనులేరా! అంతేకాదు ఇక పోటీలో గెలుపు నీదే! విష్ యు గుడ్ లక్" అని ప్రసాద్ వెళ్ళిపోయాడు.

రవి కుర్చీలో కూలబడ్డాడు.

'ఈ ఎలక్షన్ల కోసం ఇప్పటికి దాదాపు పది వేలు ఖర్చయింది. డబ్బు పోయినా ఫర్వాలేదు! తను గెలిస్తే చాలు.' అనుకున్నాడు.

ఇంతలో లోపలి నుండి లక్ష్మీదేవి రవిని పిలిచింది! రవి లేచి లోపలికి వెళ్ళాడు! లక్ష్మీదేవి టేబిల్ పైన టిఫిను ప్లేటు పెట్టింది.

"రవీ! ఈ రోజు శుక్రవారం కదా! సాయంత్రం గుడికి వెడదామనుకుంటున్నాను. నువ్వు కూడా రాకూడదూ." అనడిగింది.

"నాకివ్వాళ బొత్తిగా తీరిక లేదమ్మా! నేను గుడికి రాలేను."

"ఏమిటో రా! ఈ మధ్య నువు ఇంట్లో సరిగ్గా వుండటమే లేదు." అంటూ నిట్టూర్చిందావిడ.

"రెండు రోజులు పోనీమ్మా!" ఇక నాకు పూర్తి విశ్రాంతి. మంచం మీద నుండి దిగను! అప్పుడు నువ్వు బయటికి పొమ్మన్నా పోలేను! తెలుసా." అన్నాడు రవి నవ్వుతూ.

"సరేలే! టిఫిను తిను చల్లారిపోతోంది!" అంది. రవి టిఫిను తిని, కాఫీ త్రాగి హాల్లోకి వచ్చాడు! మేడమీదవున్న తన గదిలోకి వెళ్ళబోతుండగా ప్రభాకరం, శర్మ లోపలికి వచ్చారు.

"రవీ! ఇంట్లోనే వున్నావు కదా! అబ్బ! అలిసిపోయాం రా." అంటూ సోఫాలో కూర్చున్నారు.

"ఏమిత్రా విశేషాలు?" రవి అడిగాడు!

"రవీ! లేడీస్ ఓట్లు మనకు పడేవరకూ నమ్మకం లేదురా" అన్నాడు ప్రభాకరం.

"అదేం అలాగన్నావ్."

"నువ్వు ఆ బాధ్యతంతా సునీత మీద పెట్టావ్! కానీ ఆ సునీత ఇందాక గోపాల్‌తో మాట్లాడుతూ కన్పించిందిరా." అన్నాడు శర్మ.

ఆ మాటకి రవి నవ్వాడు.

"ఓ! అదా విషయం! మాట్లాడినంత మాత్రాన ఏవయిందిరా! బహుశ గోపాల్ సునీతని ఓటు కోసం అడుగుతున్నాడేమో." అన్నాడు రవి.

"అబ్బే! అదేం కాదురా! రవీ నీకీ విషయం చెప్పనా! సునీత నువు బెడ్ మీద వున్నప్పుడు గోపాల్‌తో షికార్లు కొట్టిందిరా" అన్నాడు ప్రభాకరం.

ఆ మాటతో రవి కళ్ళు ఎర్రబడ్డాయి. పిడికెళ్ళు బిగుసుకున్నాయి.

"నిజంగానా!" కోపంగా అడిగాడు.

"అవున్రా. అయినా ఇందులో సునీత తప్పేం వుండదులే! గోపాల్ అందమైన అమ్మాయిని చూస్తే వదలడు. పైగా డబ్బు గలవాడు. ఆడపిల్లల్ని ఎలా బుట్టలో వేయాలో బాగా తెలుసు! సునీతకేవో మాయ మాటలు చెప్పి తన వేపుకు తిప్పుకుని వుంటాడు!" అన్నాడు శర్మ.

"ఏదైనా రవీ! సునీతని పూర్తిగా నమ్మి వుండటం మంచిది కాదురా. లేడీస్ దగ్గరకు నువ్వు ప్రత్యేకించి వెళ్ళడం మంచిది." అన్నాడు ప్రభాకర్.

రవి మాట్లాడలేదు.

"ఇంకో విషయంరా! ఇవ్వాళ మనం యూనివర్సిటీ హాస్టల్లో ఒక మీటింగ్ పెట్టుకోవాలనుకున్నాం కదా! గోపాల్ వర్గం భగ్నం చెయ్యడానికి చూస్తున్నారు. బహుశ అపుడొక చిన్నసైజు యుద్ధం జరగొచ్చు."

"పోనీ మీటింగ్ కాన్సిల్ చేద్దామా రవీ." అనడిగారు.

రవి తీక్షణంగా చూశాడు.

"మనమంతా పిరికివాళ్ళమా! మీటింగ్ జరగాల్సిందే! వాళ్ళకి గట్టిగా బుద్ధి చెప్పాలి! మీరందరూ అనుకున్న టైముకే హాస్టల్ దగ్గరకు రండి. నేను కూడా నా పని చూసుకుని వస్తాను. వాళ్ళెలా మీటింగ్ అపుతారో నేను చూస్తాను." రోషంగా అన్నాడు.

రవి, శర్మ, ప్రభాకరం కాఫీ త్రాగి వెళ్ళిపోయారు. రవి మేడ మీదికి వెళ్ళాడు తన గదిలోకి వెళ్ళి మంచం మీద పడుకున్నాడు.

**అతడి** మనస్సంతా గజిబిజిగా వుంది. ముఖ్యంగా సునీత గోపాల్‌తో కూడా స్నేహం చేస్తోంది అన్న విషయం పురుగులా అతడి మనస్సుని తొలుస్తోంది.

అయితే సునీత గోపాల్‌ని కూడా ప్రేమిస్తోందా? అతడి మనస్సు ఆవేదన పడింది క్షణకాలం. కానీ వెంటనే సర్దుకున్నాడు.

"అలా జరగదు. సునీత తననే ప్రేమిస్తోంది! శర్మ అన్నట్టు గోపాల్ ఏవో మాయ మాటలు చెప్పి వుంటాడు. అమాయకురాలైన సునీతని ఆకర్షించి వుంటాడు. మోసం చేసి ఆమెతో స్నేహం నటిస్తున్నాడేమో! తన మీద ఆమెకేవైనా లేనిపోనివి కల్పించి చెప్తున్నాడేమో! ఇక తను వూరుకోకూడదు. ఆ గోపాల్ అంతు తేల్చాల్సిందే.

పైగా ఈ రోజు రాత్రికి జరగబోయే తమ మీటింగ్‌ని భగ్నం చేస్తాడుట. చూస్తానుగా ఏం చేస్తాడో! ఇంత దూరం వచ్చాక వాడికి భయపడకూడదు. ఎంత డబ్బు ఖర్చయినా సరే ఎలక్షన్లలో తను గెలవాలి. ఆ తర్వాత తను ఎంతో వైభవంగా సునీతని పెళ్ళి చేసుకోవాలి.

ఆ దృశ్యం చూసి గోపాల్ కుళ్ళి కుళ్ళి ఏడవాలి. అప్పటికి గానీ తన కసి తీరదు. ఆ రోజు తప్పకుండా వస్తుంది. తనకు నమ్మకం వుంది! అనుకున్నాడు రవి సంతోషంగా.

మరో అరగంటకి రవి స్నానం చేసి బట్టలు మార్చుకుని క్రిందికి దిగి వచ్చాడు.

లక్ష్మీదేవి హాల్లోనే కూర్చుని వుంది. బయటికి వెడుతున్న రవిని చూస్తూ –

"రవీ! ఎక్కడికి బయలుదేరావురా!" అనడిగింది.

"పనుందమ్మా."

"త్వరగా వస్తావు కదూ."

"వుహూ. లేదమ్మా నేను వచ్చేసరికి పొద్దుపోతుంది." అన్నాడు రవి.

"రవీ ఇవ్వాళ ఎందుకో నా మనస్సేమీ బాగా లేదురా. ప్రొద్దుటి నుండే ఎందుకో కుడికన్ను అదురుతోంది. ఏదో భయంగా వుందిరా."

తల్లి దిగులుకు నవ్వాడు రవి.

"ఎందుకమ్మా భయం?"

"ఈ ఎలక్షన్లు మనకెందుకురా! ఇటువంటి అనవసరమైన గొడవల్లో తల దూర్చకుండా చక్కగా చదువుకొని రావచ్చు కదా."

"ఎప్పుడూ చదువయితే విసుగ్గా వుంటుందమ్మా మధ్య మధ్య ఇటువంటి హడావుడి వుండాలి. అయినా ఇంక రెండు మూడు రోజుల్లో ఈ గోలంతా సర్దుమణిగి పోతుందమ్మా. ఆ తర్వాత ఇక జీవితమంతా విశ్రాంతే." ఆ తాళం చెవులు వూపకుంటూ బయటికి వెళ్ళిపోయాడు రవి!

లక్ష్మీదేవి వెడుతున్న కొడుకువేపు దిగులుగా చూసింది!

(ఇంకా ఉంది)






జి.యం.కె.– ఆద్రా

సిఫలిస్ రెండవ దశలో ఉన్నవారికి, పెనిడ్యూర్ మరియు పెన్సిలిన్ పడని వారు ఏ మందులు తీసుకొన వలెను. ఎన్నాళ్ళు తీసుకోవాలి. డాక్టరు సలహా ప్రకారము మందులు తీసుకొన్నా తగ్గటం లేదు.

**పెన్సిలిన్‌కి అలర్జీ ఉన్నవారు డాక్సీసిలిన్, టెట్రాసైక్లిన్ వంటి మందులను వైద్యుల సలహాపై వారి ప్రత్యక్ష పర్యవేక్షణలో వాడవలసి ఉంటుంది.**

మాధవ్ – హైదరాబాద్

నా వయస్సు 24 సం. నాకు నత్తి. ఈ వయస్సులో నాకు మాటలు సరిగా రాగలవా? నత్తి పోగొట్టుటకు "స్పీచ్ థెరపిస్టు"ల మూలముగా సాధ్యమవుతుందా? దానికి డబ్బు ఎంత ఖర్చు అవుతుంది? స్పీచ్ థెరపిస్టులు హైదరాబాద్‌లో మరియు మద్రాసులో ఎక్కడ వున్నారో తెలియ జెయ్యండి.

**మద్రాసులో అడయారులోని వాలంటరీ హెల్తు సర్వీసెస్‌లోను, హైదరాబాదులో మెడికల్ కాలేజీలోను వీరు ఉంటారు. ఇతర చోట్ల ఉన్నదీ లేనిదీ నాకు వివరంగా తెలియదు.**

వై. ఎస్. – బాలసోరు

నా వయస్సు 20 సం.లు. ఇంకా వివాహము కాలేదు. నేను ప్రతి నెల మెన్సస్ ఒక వారము ముందుగా అవుతాను. కానీ నాకు 3 రోజులు మాత్రమే బ్లీడింగ్ అవుచున్నది. ఈ వయస్సులో ఇంత తక్కువ అవ్వకూడదని విన్నాను. ఇది ఏమైనా శారీరక లోపమా? దీనికి ఏమైనా మందులు వాడాలా?

**ఇది ఏవిధమైన శారీరక లోపమూ కాదు. అనుమాన నివృత్తికి నిపుణులైన గైనకాలజిస్టులకి చూపించండి.**

పి. డి. ఆర్. – వజ్రపు కొత్తూరు

నేను 22 ఏండ్ల అబ్బాయిని. నా జననాంగము యొక్క చర్మము వెనుకకు ముందుకు కావటము లేదు. ముందు భాగములో కొంచెమే తెరచి వుంది. దాని ఆధారముగా మూత్రము వచ్చు చున్నది. అంగము కొంచము వంకరగా వుంది. దీనికి ఏమి చేయాలి. ఇలా వున్నందున పిల్లలు పుట్టటం కష్టమా!

**మీరు సర్కమ్‌సిషన్ అనే చిన్న శస్త్ర చికిత్స చేయించుకోవటం అవసరం. దీనికీ పిల్లలు పుట్టక పోవటానికీ సంబంధం లేదు.**

రమేష్ – రాజమండ్రి

నా వయస్సు 24 సం.లు. ఈ మధ్య నేను మా బంధువుల అమ్మాయిని పెండ్లి చేసుకొందా మనుకొన్నాను. కానీ ఆ అమ్మాయి తల్లికి కుష్టు వ్యాధి ఉన్న కారణముగా మా పెద్దలు ఆ పెండ్లికి ఒప్పుకొనుట లేదు. తల్లి వ్యాధి ఆ అమ్మాయికి కూడా వస్తుందని మా పెద్దలు వాదిస్తున్నారు. అలా వంశపారంపర్యముగా వ్యాధి రావటం నిజమేనా?

**తల్లికి ఉన్న కుష్టు రోగం పిల్లలకి వంశ పారంపర్యంగా రాదు. అలా అనుకోవటం మన దేశంలోని మూఢ నమ్మకాలలో ఒకటి మాత్రమే!** □

# సమాంతర రేఖలు

లీసపాటి చంద్రశేఖర్

ముని వేళ్లపై నిలబడి మందారకొమ్మ అందుకొని, వంచి పువ్వు తుంచబోయిన రఘుపతి ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు.

గోడ అవతలి నుండి, పసిమిఛాయతో మెరిసిపోతున్న చేయి ఒకటి మందార పువ్వు కోయటం గమనించాడు.

"ఎవరది?"

రఘుపతి ప్రశ్నకు గలగలమని శబ్దంచేస్తూ వైదొలగిపోయింది చేయి.

ఆశ్చర్యంతో అమ్మకు చెప్పాడు రఘుపతి. ఈ ఉదయమే పక్కింట్లో అద్దెకు దిగారని చెప్పింది అమ్మ.

ఆ కుటుంబ యజమాని పరంధామయ్యగారని, వారి ధర్మపత్ని పార్వతమ్మ, కుమార్తె వైదేహి అని తల్లిద్వారా తెలుసుకున్నాడు రఘుపతి.

* * * * * *

క్రొత్త స్నేహంలోని మధురానుభూతిని మరొక్కమారు పొంది రావటానికి రఘుపతి తల్లి, పార్వతమ్మ గ్గారింటివైపు వెళ్ళింది.

రఘుపతికి అతికొద్ది కాలంలోనే తమ రెండు కుటుంబాలూ చేరువ కావటం ఆనందాన్నీ; ఇంతకాలమైనా తను వైదేహిని చూడలేక పోవటం దిగులునూ కలిగించాయి.

స్నానంచేసి, డ్రస్‌వేసికొని 'అమ్మ యింకా రాలేదేమిఁటి చెప్మా!' అనుకొంటూ వీధి వాకిలి లోకివచ్చి పక్కింటివైపు చూసాడు రఘుపతి.

ఆ ఇంటి ముందు గుర్రబ్బండి ఆగివుంది. బండిలో వున్న వ్యక్తులతో పరంధామయ్యగారు కొద్ది క్షణాలు మాట్లాడిన తరువాత బండి కదిలింది.

జరుగుతుందో 'లేదో స్పష్టంగా తెలియని ఒకానొక శుభఘడియను అస్పష్టంగా ఊహించుకొంటూ లోనికి కదిలారు పరంధామయ్య.

ఆయనతో బాటు రఘుపతి కళ్ళు కూడా ఇంటివైపు కదిలాయి. అరుగుమీద నిలబడివుంది వైదేహి. స్తంభాన్ని ఆలవోకగా ఆనుకొని తండ్రివంక చూస్తోంది ఆమె. ఆమె రూపు రఘుపతి కళ్ళలోంచి హృదయంలో పడింది. పక్షిని మాత్రమే చూడకలిగిన అర్జునుని కళ్ళలా అతని కళ్ళు ఆమెవైపు కేంద్రీకరించాయి. మరుక్షణంలోనే ఆమె తనరూపాన్ని అతనిహృదయంలో మరింతగా ముద్రించి లోనికి కదిలి వెళ్ళిపోయింది.

* * * * * *

"ఎవరమ్మా వాళ్ళు?" పేపరు తిరగేస్తూ అడిగాడు రఘుపతి.

"పార్వతమ్మగారి వైదేహిని చూసుకోవడానికి వచ్చారురా"

రుచించని వార్త విన్నాడతను. తన భావాన్ని వ్యక్తం చేయకుండా దాచుకోవాలని క్షణకాలం పడిన ఆరాటం, ఆమెను చేసుకోబోయే అదృష్టవంతుడు ఎవరో అనే తపన రూపంలో బయటపడింది.

"పెళ్లికొడుకు రాలేదనుకొంటాను!"

దానికి తల్లి చెప్పిన సమాధానం సావకాశంగా మంచంపై నడుంవాల్చిన రఘుపతిని లేపి కూర్చొపెట్టింది.

బట్టతలలోనూ, ముదిరిన వయసులోనూ కూడా చక్కదనాన్ని, యవ్వనాన్నీ చూపించ గల్గినంతటి ఐశ్వర్యంతో మునిగి పోయిన ఒక రెండో పెళ్లికొడుకు' వైదేహికి అదృష్టాన్ని మూటకట్టి తెచ్చి అందించబోతున్నాడట.

"ఈ సంబంధం కుదిరిందంటే ఆమె అదృష్టవంతురాలు కాదనే చెప్పాలి." ఆ సంబంధంతో తనకు సంబంధంలేదని తెలిసి కూడా తన మనసును మాటలుగా మార్చి తల్లి, కందించకుండా వుండలేక పోయాడు రఘుపతి.

* * * * * *

పోస్టాఫీస్‌లో పని చూసుకొని ఇంటికి తిరిగి వస్తుండగా పరంధామయ్యగారు కలిసారు రఘుపతిని.



"ఏమిటి విశేషాలు!"

"మామూలేనండి; పోస్టల్ ఆర్డర్లు, దరఖాస్తు ఫారాలూను" ఆయనతో నడక కలిపాడు రఘుపతి.

"నేనూ ఒక దరఖాస్తు పోస్ట్ చేసి వస్తున్నాను."

"మీరా!!" ఆశ్చర్యపోయాడు రఘుపతి.

ఆయన పకాల్న నవ్వారు.

"ఉద్యోగం కోసం కాదోయ్. మా అమ్మాయికి సంబంధం కోసం విజయవాడలో పెళ్ళికొడుకెవరో వున్నారంటేనూ..."

ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు.

పరంధామయ్యగారిల్లు వచ్చింది.

"కాఫీతాగి వెళ్ళువుగాని" మధ్య తరగతి మర్యాద అతడి చేయిపట్టి లాగింది.

"ఇంటి దగ్గర కొం... చెం.... ప...." అతడి మొహమాటాన్ని ఆయన అభిమానం గెలిచి లోనికి తీసుకుపోయింది.

లోపలినుండి రెండు కప్పుల్లో కాఫీ తీసుకొనివస్తున్న ఆమెను చూసి పెద్దనగారి విద్యుల్లతా విగ్రహాన్ని చూసిన అనుభూతిని పొందాడు రఘుపతి. అంత దగ్గరగా ఆమెను చూసిన రఘుపతి గుండె అతనిని తీపిగా బాధపెడుతూ స్పీడు పెంచింది.

అతనికి ఇష్టమైన చేతులు అతని హృదయాన్ని పట్టుకోబోతున్నట్టు ముందుకువచ్చి ఆగాయి. రఘుపతి కాఫీకప్పు అందుకోబోతుంటే–

"మా అమ్మాయి వైదేహి" అంటూ ఆమెను పరిచయం చేసారు పరంధామయ్య.

ఆమె నమస్కరించింది.

అతని పెదాలపై చిరునవ్వు వెలిగింది. ఆమె లోనికి కదిలింది.

అతడు కాఫీ కప్పు పెదాలకు ఆనించాడు. చిటికెడు అమృతం లాంటి పదార్థం అతని పెదాల గుండా పయనించి, గొంతులోంచి గుండె గోడలను వత్తుకొంటూ కడుపులోనికి జారి తీయటి అనుభూతిని కలిగించింది.

పరంధామయ్యగారు ఎంతో కాలం నుండి పరిచయం వున్న మనిషితో మాట్లాడుతున్నట్టే విశ్రాంతి లేకుండా అనేక విషయాలు చెప్పుకు పోతున్నారు.

రఘుపతి మనసు వైదేహికి సంబంధించిన విషయాలేమైనా వస్తే మాత్రం జాలరి గాలంతా చటుక్కున పట్టుకొని లోన దాచుకొంటోంది.

"వైదేహికి ముప్పై దాటాయి. స్కూలు వదలి పదిహేను సంవత్సరాలయింది. చాలా సంబంధాలు రావటం, వాటి త్రోవన అవి పోవటం కూడా జరిగింది. ఉన్న కొద్ది ఆస్తి పైవాళ్ళ పెళ్ళిళ్ళకు ఖర్చు చేయటంతో ఆయన పరిస్థితి కట్నం యిస్తే పెళ్ళికి లేదు, పెళ్ళి చేస్తే కట్నానికి లేదన్నట్టు తయారయింది."

★ ★ ★ ★

రఘుపతి ఒంటరిగా తన గదిలో పచార్లు చేస్తున్నాడు.

ఆమె పవిత్రమైన రూపం, ప్రశాంతమైన చిరునవ్వు, పొందికగా పడే ఆమె అడుగులు రఘుపతి కళ్ళ ముందు కలగా కదలాడుతున్నాయి.

ఆమె చక్కదనంతో బాటు, ఆమె ప్రస్తుత స్థితికి కారణాల గురించి కూడా అతని మనసు ఆలోచిస్తోంది. అందాన్ని, అంతస్తును డబ్బుతో కాక హృదయంతో కొలిచే రోజు ఎన్నాళ్ళకొస్తుందో!

తల్లి పిలుపు అతని ఆలోచనలకు అడ్డుపడింది.

★ ★ ★ ★

తన గదిలోకి అడుగు పెట్టిన రఘుపతికి టేబుల్ పైన పోస్ట్ కవర్ కన్పించింది. చింపి చూసాడు. లోపల టైప్ చేయబడిన కాగితం వుంది. బయటకు తీసి చదివాడు.

"అమ్మా!" అంటూ ఒక్క పిలుపంత వేగంగా తల్లి దగ్గరకు చేరుకున్నాడు.

"నా జీవితానికి వెలుగొచ్చింది. నా బ్రతుకుకు ఒక దారొచ్చింది. నాకు ఉద్యోగం వచ్చిందమ్మా! నెలకు నాలుగు వందలు జీతం. అంతా నీ ఆశీర్వచన ఫలమే!" అంటూ ఆమె కాళ్ళకు నమస్కరించాడు.

"ఈ రోజు ఎంతో మంచిది. అన్నీ శుభ వార్తలే. ఇప్పుడే పార్వతి వచ్చి వెళ్ళింది. వైదేహికి రాజమండ్రి సంబంధం కుదిరిందట. తల్లి, తండ్రి బ్రహ్మానంద పడుతున్నారు. పిల్ల ఉత్తరం చూసుకుని తెగమురిసి పోతోందిట. యింత కాలానికి తన జీవితానికి వసంతం వచ్చిందని."

ఆ వార్త అతని గుండెలను పిండేసింది. లోనుండి పెల్లుబికి వచ్చిన ఏదో బాధ అతని భావాలను మెలి త్రిప్పింది. ప్రకటించాలనుకున్న సంతోషానికీ, వెళ్ళగక్క లేని బాధకూ మధ్య అతనిలో తీవ్ర ఘర్షణ చెలరేగింది. ఫలితంగా అతనూ నవ్విన నవ్వు తల్లికి వింతగా అనిపించింది.





★ ★ ★ ★

"మనిషి జీవితానికి సుఖాలకూ మధ్య ఎన్ని అవాంతరాలో!"

"దేనిని గురించి నువ్వు మాట్లాడేది!"

"అదేనమ్మా! పాపం వైదేహి, ఆమె తండ్రి ధనవంతుడు కాకపోబట్టి కదా ఆ రెండో పెళ్ళి వాడ్ని చేసుకోవలసి వస్తోంది. ఆ వయసు ముదిరిన వాడితో ఆమె ఏం కాపురం చేస్తుంది! ఏం సుఖపడుతుంది!"

"ఆ ఇంట అందరికీ అది పండగైతే నీకెందుకురా అంత జాలి!"

"నిస్సహాయతకు సమాధానంగా ఒక జీవి పడే తృప్తికి."

"ముందు నీ వేదాంతం కట్టి పెట్టి పరంధామయ్యగారికి ఒకసారి కన్పడిరా. నీకు ఉద్యోగం వచ్చిందని తెలిసి చాలా సంతోషపడ్డారట. పెద్దవారు, ఒకసారి ఆయనను కలిస్తే అనుభవం వున్న వారు కాబట్టి ఉద్యోగంలో తెలుసుకోవలసిన మెలకువ లేమైనా వుంటే చెబుతారు."

★ ★ ★ ★

కొద్దిగా తెరచి వున్న తలుపును నెమ్మదిగా

# ధర్మపథం - స్థావరజంగమాలు



భగవంతుని సృష్టిలోని స్థావరముల్లోనూ, జంగమాల్లోనూ ప్రయోజనరహితమైనది ఏదీ లేదు. చెట్లలో కొన్ని సువాసన నిస్తాయి. కొన్ని కాయల నిస్తాయి. కొన్నిటి కాయలూ, పండ్లూ కూడా ఎంతో ఉపయోగపడతాయి. సస్యాలు మానవ జీవనానికి ఆధారంగా ఉంటాయి. కొన్ని వృక్షాలు పుష్ప, ఫలాలను ఇయ్యలేకపోయినా, చల్లని నీడ నిస్తాయి. ఈ చెట్ల పుష్పఫలాలను ప్రజలు తీసికొని ఎంతో ఆనందిస్తారు. జనం తీసికోకపోతే అవి రాలి వాడి, వత్తయి, కుళ్ళి నశించిపోతాయి. వాటి వల్ల ఆ వృక్షాలకు కలిగే ప్రయోజనం లేదు. ఇది వాటి పరోపకార పరాయణత్వానికి గురుతు. పుష్ప ఫలాల వల్ల ప్రయోజనం లేకపోయినా, కొన్ని వృక్షాలు చల్లని నీడ నిస్తాయి. ఆ నీడనయినా ఇవ్వలేని బూరుగు చెట్టు, మర్రి చెట్టు నీడ నాశ్రయించిన జనాన్ని చూచి, తన దురదృష్టానికి మిక్కిలి బాధపడినట్లు ఒక కవి చక్కగా వర్ణించిన శ్లోకం చాలా ప్రసిద్ధం. వాస్తవానికి, ఆ బూరుగు చెట్టు వల్ల ప్రయోజనం లేకపోలేదు. అది మిక్కిలి మృదువైన దూదిని ఇస్తున్న సంగతి అందరికీ తెలుసును.

వృక్షాలు జీవించి యున్నప్పుడే కాదు. అవి చచ్చిపోయినా, వాని ప్రతి అవయవమూ ఎంతో ఉపయోగిస్తుంది. మ్రాను కలపకూ, వంట చెరకుకూ ఉపయోగిస్తుంది. కొమ్మలు, ఆకులూ కూడా ఉపయోగపడతాయి. వాటిని జనం ఎన్నో ఉపకరణాల తయారికీ ఇతర పనులకూ వాడుకుంటున్నారు.

ఇక మృగాల సంగతీ అంతే. సాధుజంతువులయిన ఆవులూ, మేకలూ పాలిస్తాయి. గొర్రెల బొచ్చు కంబళ్లకు మిక్కిలి ప్రయోజనకరమైనది. పశు మాంసం ఆహారం కొందరికి. క్రూరమృగాలనూ, సర్పాలనూ మచ్చిక చేసుకుని మానవుడు ఎంతో ప్రయోజనం పొందుతాడు. అవి చచ్చిన తర్వాత వాని తోళ్లు, గోళ్లు, ఏనుగుల దంతాలు వాని విలువను పెంచుకుంటాయి. ఎద్దులు, దున్నలు వ్యవసాయాని కుపయోగపడుతున్నవి. జ్ఞానవంతుడైన మానవుడు జ్ఞానం లేని వృక్షమృగాల వల్ల మహోపకారాన్ని పొందుతున్నా కృతజ్ఞత చూపక హింసిస్తూ ఉంటాడు. అతడు మరణించిన పిదప శరీరం దహనం కావలసినదే! లేదా భూమిలో పూడ్చవలసినదే! దాని వల్ల అణుమాత్రం ప్రయోజనం ఉండదు.

ఈ విషయాన్ని గమనించి, మానవుడు వాని విలువను తెలుసుకోవాలి. వాటి వల్ల గుణపాఠాన్ని గ్రహించి, తన జీవితాన్ని ఉత్తమంగానూ, ఇతరుల ప్రయోజనాలకు అనువుగా ఉండేటట్లుగాను మలుచుకోవాలి. అతడు జ్ఞానం కలిగి ఉన్నందుకు ఇదే పరమ ప్రయోజనం.

–బులుసు వేంకటరమణయ్య

తోసాడు రఘుపతి. లోపలి గదిలో నుంచి మాటలు స్పష్టంగా విన్పిస్తున్నాయి.

"పక్కింటి రఘుపతికి ఉద్యోగం వచ్చిందట తెలుసా?"

"విన్నాను. అమ్మ చెప్పింది."

"మొత్తానికి పురుష లక్షణాన్ని సాధించాడు."

"అదేదో గొప్ప ఉద్యోగమయినట్లు మాట్లాడుతావేంటి నాన్నా! జీతం నాలుగొందలేనటగా!"

"అదేవిటమ్మా అలాగంటావు! ఏదో ఒక ఉద్యోగం

## సమాంతర రేఖలు

అసలంటూ లేనిదానికన్నా యిది నయమే కదా!"

"అలా అనుకుంటే సరిపోతుందా! రేపు పెళ్ళి అయి పిల్లలు పుడితే వాళ్ళను పోషించడానికి ఆ నాలుగొందలూ ఏమూలకి! నీ వన్నట్లు ఏదో ఒకటని తృప్తి పడటానికయితే యిది సరిపోతుంది ఏమైనా రఘుపతిని తలచుకుంటే ఎవరికయినా జాలి కలుగక మానదు."

ఒక్క క్షణం పాటు నిశ్చేష్టుడయ్యాడు రఘుపతి.

ఇద్దరి జీవితాలకూ ఒకేలాంటి సమస్య; ఇద్దరి సమస్యలకూ ఒకేలాంటి పరిష్కారం. తను సాధించిన దానికి తృప్తి, మరొకరు సాధించలేదను కొనిన దానికి జాలి.

"ఎంత భరించలేని నిజం!"

తెరువబడిన తలుపులు అతి నెమ్మదిగా మూసుకున్నాయి.

అతని అడుగులు భారంగా పడుతున్నాయి. □

# 2+2=8




ఇది వింతాకాదు, అలా అని విచిత్రమూకాదు
ముమ్మాటికీ నిజం సుమండి!
అయినా ఒక్కసారి ఆలోచించి చూడండి!
మీ లెక్కలు తప్పూకాదు.
మేము చెప్పేది అబద్ధమూకాదు.

ఎలాగంటే! NSO లోని ఆరవ ఇష్యూలో ప్రతి నెలా
రు.200/- మీరు పొదుపు చేశారనుకోండి.
ఆరేళ్ల తర్వాత వ్యవధి పూర్తయి అవి ప్రతి నెలా రు 403/- గా
మీ చేతికందుతాయి.

దానిని మరలా ఆ పథకంలోనే పొదుపు చేశారనుకోండి.
మరో ఆరేళ్ళ తరువాత మీకు నెల నెలా రు 806/- లభిస్తాయి.
మరి మా లెక్కలు నిజమేనంటారా!




వివరాలకు: .
మీకు దగ్గరలో ఉన్న పోస్టాఫీస్, జిల్లా కలెక్టర్ కార్యాలయంలో
స్పెషల్ తహసిల్దార్, జిల్లా సేవింగ్స్ అధికారి, భారత
ప్రభుత్వం, డిప్యూటి డైరెక్టర్, స్మాల్ సేవింగ్స్.

జారీచేసినవారు : .
కమీషనర్,
స్మాల్ సేవింగ్స్, ఆంధ్రప్రదేశ్,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029

## మీ భద్రత మా బాధ్యత

సీరియల్

# కాంచన సౌధం

రావినూతల సువర్ణాకన్నన్

(గత సంచిక తరువాయి)

కేసు మరో మలుపు తిరిగింది.

ఆయాని హత్య చేసింది డాక్టరు గాక, దాసు కాక మరెవరు? ఆనంద్ చెప్పినట్టు... ఆయా భర్త చంపి ఉంటాడా? అతనెవరు? ఎక్కడుంటాడు?. అందరికి ఇవే ప్రశ్నలు!

కల్పన ఎన్నో విధాల ఆలోచిస్తోంది ఆయా అసలైన వూరేదో తెలుసుకోవడానికి ఆ వూరు తెలుసుకుంటే హంతకుణ్ని తేలిగ్గా పట్టుకోవచ్చని ఆమె ఊహ!

'అమ్మాయిగారూ!" ఆతృతగా పరిగెత్తుకొచ్చింది మంగి. కళ్ళ మీద చేతులుంచుకుని ఏదో ఆలోచిస్తూ పడుకున్న కల్పన త్రుళ్ళిపడి చూసింది.

"అమ్మాయిగారూ! అర్జంటుగా రావాలి!" గబగబా అంది మంగి ఆమె మొహంలో చెప్పలేని ఆశ్చర్యం!

"ఏమిటి?" గభాల్న లేచి అంది కల్పన

మంగి రహస్యంగా కల్పన చెవిలో ఏదో చెప్పింది. కల్పన కళ్ళు తళుక్కుమన్నాయి!

"ఉండు! మమతతో కూడా చెప్తాం!" అంటూ చకచకా మమత దగ్గరికి పరిగెత్తింది మంగితో సహా మమతకి విషయం చెప్పారు

మమత ముఖం దివిటీలా వెలిగిపోయింది మంగిని పంపేసి కల్పన, మమత యాదయ్యా వాళ్ళింటి కెళ్ళారు.

అతను చుట్ట కాల్చుకుంటూ అరుగు మీద కూర్చున్నాడు వాళ్ళని చూడగానే ముందు కాస్త కంగారు పడినా వెంటనే తేరుకుని వాళ్ళ నాహ్వానించాడు.

**జరిగినకథ –13 :** విశ్వం దగ్గర కల్పన ఫోటో, కల్పన దగ్గర విశ్వం ఫోటో ఉండటంతో మమత వాళ్ళని ఆ విషయం నిగ్గదీసి అడుగుతుంది. చౌదరి విశ్వాన్ని శత్రువులా చూస్తున్నాడు. విశ్వం రాయుడి గారింట్లో భోజనం చేస్తున్నాడు. ఎలక్షన్లలో రాయుడు నెగ్గాడు చౌదరి ఓడాడు. మమతకు విశ్వం మీద పగ రెట్టింపయిందీ. మమతకి టైఫాయిడ్ వస్తే పట్నంలో నర్సింగ్ హోమ్‌లో చేరుస్తాడు చౌదరి. విశ్వం జరిగిన విషయాలన్నీ మనసు విప్పి మాట్లాడాలని మమత దగ్గరకి వెళితే మమత అతనితో మాట్లాడను నిరాకరించింది. కల్పన మంగిని తీసుకుని మమతను చూడటానికి వెళ్ళింది. కల్పన కథ విన్న మమత వెంటనే విశ్వాన్ని క్షమాపణలు వేడుకోవాలనుకుంటుంది. కల్పన చేత, తన తండ్రి చేత కబురు పంపినా విశ్వం రాకపోవడంతో అతనికి తనపై చాలా కోపం వచ్చిందని ఏడ్చింది మమత. విశ్వం ప్రవర్తన వింతగా తోస్తుంది కల్పన, మమతలకి. పదివేలిస్తే సరి లేకుంటే గుట్టు బయట పెడతానని బ్లాక్ మెయిల్ చేస్తుంది విశ్వాన్ని ఆయా రమ. ఆ రోజు రాత్రే ఆమె హత్య గావింపబడుతుంది. ఆ హత్యా నేరం డాక్టర్ విశ్వం మీద మోపబడుతుంది. నక్సలైట్ ఆనంద్ విశ్వం ఈ హత్య చేయలేదని కోర్టులో చెపుతాడు.

అంతా లోపలికెళ్ళి కూర్చున్నారు

'ఏవిఁటమ్మా ఇలా వచ్చారు?" నవ్వుని మొహానికి పులుముకుంటూ అన్నాడతను.

"దాసు ఊళ్ళో లేడా?" అతని మాటకి జవాబు చెప్పకుండానే అంది కల్పన

"లేదమ్మా! పట్నం వెళ్ళాడు!" అన్నాడతను.

"సరే! బానే వుంది! అన్నట్టు నీకు డబ్బెంత ముట్టింది? ' అతి సామాన్యంగా అడిగినట్టు అడిగింది మమత

"డబ్బేవిఁటమ్మా?" అమాయకంగా అన్నాడు యాదయ్యా అతని మొహంలోని భీతి... వాళ్ళు గమనించక పోలేదు

"అమాయకంగా మాట్లాడకు. నీకు తప్పుడు సాక్ష్యం చెప్పినందుకు దాసు ఎంత డబ్బిచ్చాడు?" కఠినంగా అంది కల్పన.

కొయ్యబారి పోయాడు యాదయ్య

"చెప్తావా?...పోలీసుల్ని పిలవమంటావా?" దబాయించింది మమత.

పోలీసుల మాట వినేసరికి మరి ఒణికిపోయాడు యాదయ్య. అమాంతం వాళ్ళ కాళ్ళ మీద పడిపోయాడు.

"సరే! లే! జరిగింది చెప్పు! ... నీకు శిక్ష పడకుండా మేం చూస్తాం!" అభయం ఇచ్చారు ఇద్దరూ. అతను తేరుకున్నాడు. మెల్లగా లేచి కూర్చున్నాడు.

"డాక్టరే ఆయాని చంపుతానని బెదిరించడం నువ్వు చూశావా?" అడిగింది కల్పన.

"ఊఁహూఁ!"

"మరెందుకలా చెప్పావ్?"

"నాకేం తెలియదమ్మా! దాసు నా దగ్గరి కొచ్చి అలా చెప్పమనీ చెప్తే.. అయిదు వందల రూపాయలిస్తానని చెప్పాడు. డబ్బు మీది ఆశతో... ఈ వెదవ పని చేశాను." దాదాపు ఏడుస్తున్నట్టు అన్నాడతను.

"మరి డబ్బు ఇవ్వలేదా?"

"లేదమ్మా!...ఓ యాభై రూపాయలిచ్చి సరిపెట్టుకోమన్నాడు. నాకు కోపం వచ్చింది. తిట్టాను. పోలీసులకి నిజం చెప్పేస్తానని బెదిరించాను అతను నవ్వేసి,

"చెప్పు! తప్పుడు సాక్ష్యం చెప్పినందుకు ముందు నిన్నే మూస్తారు!" అంటూ బెదిరించాడు. నాకు భయమేసింది. మరి నాలుగు తిట్టాను. అప్పుడే హఠాత్తుగా మంగి వచ్చిందిక్కడికి. మా మాటలు వినిందేమో అని కంగారు పడ్డాను. అసలు ఆమెని గమనించకుండానే వెళ్ళిపోయాడు దాసు. మెల్లగా మంగిని పలకరించాను కానీ... తను మా మాటలు విన్నట్టు అనిపించలేదు. తేలిగ్గా వూపిరి తీసుకున్నాను. కానీ. ."

"అవును! మంగి మీ మాటలన్నీ స్పష్టంగా వింది!" నవ్వుతూ అంది మమత.

భయంగా చూశాడు యాదయ్య.

"మేం చెప్పినట్టు చేస్తే నీకేం భయంలేదు" అంది కల్పన.

'ఏవిఁటమ్మా?" ఆశగా అన్నాడతను

ఇదంతా రేపు కోర్టులో చెప్తావా?"

"ఆ! చెప్తాను!" అన్నాడతను.

'సరే!. .నిన్నిలా అడిగినట్టు దాసుకి చెప్పద్దు!" అంది మమత లేస్తూ.

"సరే" అన్నట్టు తలూపాడు యాదయ్య.

మమత, కల్పన పట్నం వెళ్ళి పోలీసుల్ని కలిశారు. విషయమంతా వివరించారు. పోలీసులు దాసు చెప్పిన ఇంటి కెళ్ళారు కల్పనా వాళ్ళతో సహా.

వాళ్ళని చూసి ఆశ్చర్యపోయిన అతనితో –

"ఫలానా రోజు దాసు మీ ఇంటికొచ్చాడా?" అని అడిగాడు ఎస్సై.

"దాసు మా ఇంటికొచ్చి దాదాపు ఆర్నెల్లయింది! ఏం?" అన్నాడతను కంగారు పడుతూ.

పోలీసులు తనని అనుమానించక పోవడంతో దాసు వెళ్ళి స్నేహితునికి, ఆ రాత్రి తమ ఇంట్లోనే ఉన్నట్టు చెప్పమనలేదు. ఆ కారణంగా ఆ ఇంటి వాళ్ళు నిజం చెప్పేశారు.

"అతనికేమైనా జరిగిందా?" మళ్ళీ అడిగాడా స్నేహితుడు ఆదుర్దాగా.

"లేదు!" అంటూ విషయం క్లుప్తంగా చెప్ప వెనుతిరిగారంతా.

మళ్ళీ కేసు మొదటి కొచ్చింది.

కోర్టులో ఆనంద్ చెప్పిన దాన్ని బట్టి దాసుకి, ఈ హత్యకి ఎలాంటి



సంబంధం లేదు. ఇప్పుడు దాసు చేసిన పన్ను చూస్తే అతనే హంతకుడు అనిపిస్తోంది. ఏ నేరం చెయ్యకపోతే.... దాసు ఆ రాత్రి వూళ్ళో లేననీ, ఎక్కడో వున్నాననీ అబద్ధం ఎందుకు చెప్పాడు? కేసు తన మీద కొస్తుందని భయపడ్డాడా?... పోనీ అలా అనుకుందామన్నా... డబ్బు ఆశ పెట్టి దొంగ సాక్ష్యం ఎందుకు చెప్పించాడు!...." ఎంత ఆలోచించినా వాళ్ళకి జవాబు లేని ప్రశ్నలయిపోయాయి.

"దాసుని బెదిరిస్తే?" హటాత్తుగా అంది కల్పన.

"అవును! ఇంక అదే దారి!" అన్నాడు ఎస్సై.

* * * * *

పోలీసులు, కల్పన, మమతా అందరూ తన ఇంటికోసే రావడం చూసి బెదిరిపోయాడు దాసు. మళ్ళీ కోర్టులో ఆనంద్ హంతకుడు తను కాదని చెప్పడం గుర్తొచ్చి ధైర్యం తెచ్చుకున్నాడు.

"దాసూ! ...నేరం ఒప్పేసుకో!" గంభీరంగా అంది మమత.

"ఏవిఁటమ్మాయిగారూ?" కంగారుగా అన్నాడతను.

"నువ్వు ఆయాని చంపావ్!"

"రామరామ! ...నాకే పాపం తెలియదమ్మాయిగారూ." బిక్కమొహంతో అన్నాడు.

"తెలుసు! ఆ రాత్రి నువ్వే ఆమెని చంపావ్!" కఠినంగా అన్నాడు ఎస్సై.

"నేనా రాత్రి ఊళ్ళోనే లేను." బింకంగా అన్నాడు దాసు.

ఆడవాళ్ళిద్దరూ ఫక్కున నవ్వారు. మరింత బిత్తరపోయాడు దాసు.

"ఎక్కడున్నావ్?" కూల్‌గా అడిగాడు ఎస్సై. చెప్పాడు దాసు.

"మేం అక్కణ్ణించే ఇప్పుడొచ్చేది! నువ్వు అసలు వాళ్ళింటికెళ్ళి ఆర్నెల్లు దాటిపోయిందట!..."

అంతే! దాసు మొహం పాలిపోయింది. కానీ.... ఏదో చెప్పబోయాడు... మమత అడ్డుకుని –

"దాసూ! ... ఫ్యారాన పడకు!...యాదయ్య కూడా విషయమంతా మాకు పూర్తిగా చెప్పేశాడు." తాపీగా అంది.

దాసు ఒణికిపోయాడు. వెంటనే కూలబడి బోరుమంటూ ఏడ్చేశాడు.

తరవాత తేరుకుని ఇలా చెప్పాడు.

* * * * *

రాత్రి ఒంటి గంటయిందో, కావస్తోందో హటాత్తుగా మెలకువ వచ్చింది. వీధిలో ఎవరివో అడుగుల సవ్వడి వినిపించింది. మెల్లగా లేచి చూశాను.

ఆయా రమ.

దిక్కులు చూస్తూ ... నెత్తిన చెంగు కప్పుకుని ఒంటరిగా ఎక్కడికో బయల్దేరింది. సాధారణంగా తను రాత్రులు ఎక్కడకైనా వెళ్ళాల్సొస్తే నన్ను తోడు తీసికెళ్తుంది. కానీ ... ఇప్పుడు ఒంటరిగా వెళ్తోంది!

నాకు అనుమానం. ఆశ్చర్యం రెండూ కలిగాయి. అందుకే ఆమెక తెలియకుండా అనుసరించాను. ఆమె సరాసరి డాక్టర్ వగ్గరికెళ్ళింది.

ఆమె స్వభావం పూర్తిగా తెలిసిన నాకు పిచ్చి కోపం వచ్చింది. "అంటే ఈ డాక్టర్ని కూడా వల్లోకి లాగిందన్నమాట! ...అందుకే అతగాడు ఈ మధ్య హాస్పటల్ వదిలి వెళ్ళడం లేదు!" అని ఏదేదో వూహించుకుని పళ్ళు నూరుకున్నాను.

అయితే నేను ఊహించిందేం లేదు. రమ డాక్టర్ని బ్లాక్‌మెయిల్ చేస్తోంది.

"అంటే అతనేదో నేరం చేశాడన్నమాట! ఆ నేరం చెయ్యడం ఈ రమ చూసిందన్నమాట!" అనుకుని చాట్నుంచి మరింత శ్రద్ధగా విన్నాను.

డాక్టర్ బెదిరించడం కూడా విన్నాను. నాకు వెంటనే ఓ ఆలోచన వచ్చింది. ఎలాగైనా ఈ వంకన ఆమె నొదుల్చుకోవాలి.

ఈమధ్య నన్ను రమ మరీ ప్రాణం తీసేస్తోంది. పెళ్ళి చేసుకోమని!... చూస్తూ చూస్తూ ఓ విధవని చేసుకోవడం నాకిష్టం లేదు. అదీగాక ఆమెకున్న కామ దాహం కూడా నాకు తెలుసు!... నా దగ్గర కూడా ఎక్కువ రోజులుంటుందన్న నమ్మకమూ లేదు.

అందుకే తెలివిగా ఆమెని చంపేసి ఆ నేరాన్ని డాక్టర్ మీద పెట్టాలనుకున్నాను. డాక్టర్ మీదున్న పగ కూడా తీరుతుంది!...

ఉత్సాహంగా వచ్చి కామ్‌గా ఇంట్లో పడుకున్నాను. ఆ తరువాత రమ రావడం గమనించి మెల్లగా వచ్చి చూశాను. లోపల్నించి మాటలు వినిపిస్తున్నాయి. ఆశ్చర్యంగా తొంగి చూశాను. అంతే! కొయ్యబారి పోయాను.

ఓ అపరిచిత వ్యక్తి రమని కింద పడేసి ఓ దిండు ఆమె ముఖం మీద పెట్టి బలంగా నొక్కుతున్నాడు. నాకు దిక్కు తోచలేదు. కాళ్ళల్లోంచి ఒణుకొచ్చేసింది.

తేరుకుని చూసేసరికి అతను వెళ్ళిపోయాడు. నేను గబగబా లోపలికెళ్ళి చూశాను.

రమ శ్వాస ఆగిపోయింది. నాకు మరింత కంగారొచ్చింది.

"ఇప్పుడేం చెయ్యాలి?" అని ఆలోచించాను. అంతే! ఓ ఊహ తళుక్కుమంది. వెంటనే వీధిలో కెళ్ళి చూశాను. అంతా చీకటి! నిశ్శబ్దంగా ఉంది.

గబగబా లోపలి కొచ్చి రమని బుజాన వేసుకుని జాగ్రత్తగా డాక్టర్ హాస్పటల్ వరండాలో పడుకోబెట్టాను. బట్టలు అస్తవ్యస్తంగా ఉండేలా సర్దాను. ఆమె మీద నా వేలిముద్రలు లేకుండా జాగ్రత్త పడ్డాను.

నా ఉద్దేశం ఆమెని డాక్టర్ చంపాడని అందరూ అనుకోవాలని! నా నోటి ముందు కూడు తీసిన అతను అవమానం పాలవ్వాలి! అదే నా ధ్యేయం!

చీకటితోనే యాదయ్యకి డబ్బు ఆశ పెట్టి దొంగ సాక్ష్యం చెప్పేలా ఒప్పించాను.... నా పథకం నెరవేరింది. అంతా అనుకున్నట్టే జరిగింది! డాక్టర్ని అరెస్టు చేశారు.

అయితే నాకు డబ్బు అందనందున యాదయ్యకి పూర్తి డబ్బు ఇవ్వలేక పోయాను. అతను నన్ను నిలదీసి అడిగాడు. ఘర్షణ పెరిగింది! నా కర్మ కాలి అది ఎవరో విని మీదాకా తెచ్చారు." అంటూ ముగించాడు దాసు.

అతన్ని కూడా కస్టడీలోకి తీసుకున్నారు పోలీసువారు.

"అయితే నిజంగా దాసు చంపలేదు! అతను చెప్పిందానికి ఆనంద్ చెప్పిందానికి సరిపోతుంది.

అయితే హంతకుడెవరు? ఆమె భర్తే అయి వుండాలి! ఆమె నిజంగా విధవ అయి వుండదు. ఆనంద్ చెప్పిందాన్ని బట్టి చూస్తే ఆమె భర్తని మోసం చేసి లేచి వచ్చి విధవగా బ్రతుకుతూండాలి!

"అయితే ఆమె అసలు వూరేది?" అన్న ప్రశ్నకి జవాబు దొరకలేదు.

చివరకి రమ ఇల్లు గాలించారు. వారు ఆశించింది దొరికింది.

## అంకితం

ప్రఖ్యాత రచయిత శ్రీ గుడిపాటి వెంకటచలంగారి సోదరి, ప్రముఖ ఉపాధ్యాయులు శ్రీ దుర్గా చిన పట్టాభిరామయ్యగారి సతీమణి, బందరు మహిళా సేవా మండలి సంస్థాపకురాలు, నాకత్యంత ఇష్టురాలు, పండు తమలపాకులా వుండి చూసిన వెంటనే రెండు చేతులా జోడించి నమస్కరించాలి అనేంతటి వున్నతురాలు అయిన శ్రీమతి దుర్గా వెంకటరమణమ్మగారికి ప్రేమాభిమానాలతో -

-సువర్ణాకన్నన్

एक सौ रुपये

ONE HUNDRED RUPEES

# జై కిసాన్ పనితనం అద్భుతం పొలంలో పండింది బంగారం

కారణం ఏమిటంటే, ఉత్తమ శాస్త్రీయ పద్ధతిలో తయారైన జైకిసాన్ ఎరువులు నీటిలో ఇట్టే కరుగుతాయి, మొక్కలకు వెంటనే అందుతాయి. అంచేత కొస్తంత ఎరువు కూడా వృధాగా పోదు, పూర్తిగా మొక్కలకు అందుతుంది. మరి, మీరు కూడా జైకిసాన్ ఎరువులు తెచ్చుకోండి, పొలంలో బంగారం పండించండి!

**జైకిసాన్ యూరియా 46.4% నత్రజని**

స్వచ్ఛమైన తెల్లని గుళికల రూపంలో వుండే జైకిసాన్ యూరియా 46.4% నత్రజనితో సమృద్ధమైనది. ప్రతి నేలకూ, ప్రతి పంటకూ ఉత్తమమైనది.

**జైకిసాన్ సంపూర్ణ 19:19:19**

ముఖ్యంగా ప్రత్తి, వరి, గోధుమ, చెరకు మొదలైన పంటలకూ, పొటాష్ లోపం గల నేలలకూ ఉత్తమమైనది.

**జైకిసాన్ సామ్రాట్ 18:46:0**

వర్షాధార పంటలకు ఇది అతి ఉత్తమమైన ఎరువు. ప్రతి నేలకూ. ప్రతి పంటకూ అనువైనది.

---

సరైన సంతులిత ఎరువులు వాడితే అత్యధిక లాభాలు చేకూరుతాయి. జువారి వారి ఉచిత భూసార పరీక్ష సేవను వినియోగించుకొని ప్రయోజనం పొందండి.

---













## జై కిసాన్ రాజ్యం-ధాన్యలక్ష్మి సామ్రాజ్యం

**జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా**

ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు : సికింద్రాబాద్, విజయవాడ, బెంగుళూరు, హుబ్లి, నాగ్‌పూర్, పుణె, ఇండోర్, ఆగ్రా, జువారి నగర్.

LINTAS ZUA 133 2317 TL

ఏవో ఉత్తరాల ద్వారా రమ అసలైన ఊరు కనుక్కున్నారు. ఆపై ఆమె భర్త ఉనికి కనుక్కున్నారు.

తీగ లాగారు! డొంకంతా కదిలింది! రమ భర్త తన నేరాన్ని తేలిగ్గానే ఒప్పుకున్నాడు. అతన్ని అరెస్ట్ చేశారు ఆ తరువాత విశ్వాన్ని నిర్దోషిగా ప్రకటించారు

కల్పన, మమత, విశ్వం జైల్లో వున్న ఆనంద్‌ని కలుసుకున్నారు.

"ఆనంద్! ..నేను నిర్దోషినని నిరూపించుకున్నా ఆ ఆనందం నాకే మాత్రం లేదురా." గద్గద స్వరంతో అన్నాడు విశ్వం. అతని కళ్ళు నీళ్ళతో నిండుకున్నాయి.

ఆనంద్ చల్లగా నవ్వాడు.

"పరవాలేదు విశ్వం! మావి నిత్యం గండపు బ్రతుకులు. ఇవాళ పట్టుబడకపోయినా రేపో, ఎల్లుండో పట్టుబడక పోను.... అందుకే.... నా మూలంగా శిక్ష పొందుతున్న నిన్ను ఆదుకోవడం నిజమైన న్యాయం' అంటూ స్నేహితుని చేతులు నొక్కి వదిలాడు.

మమత రెండు చేతులూ జోడించింది.

"మీరే చెప్పకపోతే మా బావ.. ." దుఃఖంతో ఆమెకి మాట రాలేదు.

"అదేం కాదమ్మా! .. ఎలా జరగాల్సిందలా జరిగింది!" తేలిగ్గా నవ్వేశాడు ఆనంద్.

కల్పన కూడా కృతజ్ఞతలు చెప్పింది.

* * * * *

కల్పన హడావిడిగా సామాన్లు సర్దుకుంటోంది. రాయుడు ఓ మూలగా కూర్చుని... కళ్ళు తుడుచుకుంటున్నాడు.

హడావిడిగా వచ్చాడు విశ్వం.

"రా విశ్వం! ..' నవ్వుతూ ఆహ్వానించింది కల్పన.

విశ్వం నవ్వలేదు

"ఇది... నిజమేనా?" అన్నాడు సిరియస్‌గా.

"ఏది?"

"నువ్వు యు ఎన్. ఒ. తరపున రెడ్‌క్రాస్ సంఘంలో చేరుతున్నావా?"

"అవును విశ్వం! ఎందుకో నా కందులో మనశ్శాంతి దొరుకుతుందని పించింది!" మెల్లగా అంది కల్పన

"ఇది. . నీకు న్యాయం కాదు కల్పనా!" ఒణుకుతున్న గొంతుతో అన్నాడు విశ్వం

"ఏం? .."

'మా మాటటుంచి, ఈ వయసులో మీ నాన్నగార్ని వదిలి నువ్వు వెళ్ళి పోవడం.. . నీకేమో గాని, ఎవరికి నచ్చదు!"

"నీకు నచ్చిందా?" తడి ఆరని కళ్ళతో నవ్వుతూ అంది కల్పన. విశ్వం గుండెలు పిండినట్టయింది

'ఛ! ...ఛ!.. ఊర్కో అన్నాను విశ్వం!.. అయినా నాన్నకు మీరంతా లేరూ? .. అదిగాక నేను శాశ్వతంగా వెళ్ళి పోవడం లేదు! .. మనసు కాస్త కుదట పడగానే వచ్చేస్తాను!" అంది కల్పన నవ్వేస్తూ.

"విన్నావా నాయనా! ఇది వరస! ... ఇంతదాకా.. . మమత గొడవ చేసింది, ప్రయాణాన్ని మానుకోమని... కాని .. కల్పన పంతంలో మార్పు లేదు! .. ఈ వయసులో ఇంకెన్ని బాధలు పడాలో!" కళ్ళు ఒత్తుకుంటూ అన్నాడు రాయుడు

చౌదరి, మరి కొందరు కూడా ఎన్నోవిధాల చెప్పారు.. ఈ ప్రయాణాన్ని మానుకోమని కానీ కల్పన అందరి మాటల్ని సున్నితంగా త్రోసిపుచ్చింది.

మమత కళ్ళు వాచేలా ఏడుస్తోంది.

"ఏయ్! ఏమిటది! పిచ్చా?" నవ్వుతూ ఆమె కళ్ళు తుడిచింది కల్పన.

"అవును కల్పనా పిచ్చే! .. మా నుంచి దూరంగా పారిపోతున్న నీ కోసం ఆరాటపడుతున్నాం చూడు. .. మాకు నిజంగా పిచ్చే మరి! ..

కాని.. . కల్పనా!.. ఇప్పుడు నివ్వు వెళ్ళిపోతే .. మేం జీవితాంతం బాధపడాలి!" ఆవేదన, ఆవేశం నిండిన గొంతుతో అంది మమత

"బాధెందుకు?.. "

"నువ్వు ఆశించిన దాన్ని నీక్కాకుండా చేసినందుకు!"

"లేదు!. .. నాకు కాని వస్తువుకోసం నేనే ఆరాటపడి పొరపాటు చేశాను!.. . అందుకే ఆ పొరపాటును ఇప్పుడు దిద్దుకుంటున్నాను!"

"కానీ.... దానిక నువ్వు దేశం వదిలి పోనక్కర్లేదు!.. ."

"నిజమే మమతా! ... కానీ.... ఈ వెధవ మనసుందే!.. కోతి లాంటిది! .. చెప్పిన మాట వినకుండా అల్లరి పెడుతుంది! . దీని అల్లరి నుంచి తప్పించుకోవడాని ఇంతకన్నా మార్గం నాక్కనిపించలేదు!" అంది కల్పన.

ఆమె కళ్ళు శ్రావణ **మేఘాలయ్యాయి. అందరి** మనసులూ భారంగా

# అభిమన్యుడి హత్య

-రామా చంద్రమౌళి

రోడ్డుపైనడచి వెళ్తున్న ఆ పన్నెండేండ్ల పసివానిపైజాలేసి
భయమేస్తోంది
వాని చుట్టూ ఎన్ని ఎక్కుపెట్టిన విషబాణాలో
ఒళ్ళంతా బూతుతో పిలిచే పత్రికలు,
ఉత్కంఠతో జీవింపజేసే "రేపు"కోసం తపనను చంపి
తరాన్నే నిర్వీర్యం చేసే సినిమాలు,
అశ్లీలగానంతో కలుషితమై విలపించే గాలి
విశృంఖలమై బజార్లో మొహం మొత్తించే రాక్షస స్వేచ్ఛ
పరీక్షల్లో కొడుక్కు తండ్రి "చిట్టీ" అందించే వింత సంస్కృతి –
గోడలపై రెండే రెండు కదలికలు
పరస్పరం మొరుక్కునే రాజకీయ నినాదాలు
స్తన సౌందర్యాలను రోడ్డుపై పారబోసే పోస్టర్ల రోదనలు
సమ్మెల్లో కూరుకుపోయి, వ్యాపారాల్లో అలసిపోయి, ముసుగుల్లో
చచ్చిపోయి
శవాలుగా మిగులుతున్న విద్యాలయాలు –
కళ్ళు తెరిస్తే బూతు,
చెవులు విప్పితే రోత
మెదడును విదిలించితే శూన్యం– దిక్కుతోచని గమ్యం
దొరకని నడిపించే మార్గం....,
అయ్యో – ఒక్క పసివానిపై ఎంత రాక్షసమైన దాడి
మేధావులు, గురువృద్ధులు, విజ్ఞులు, నిద్రించే వీరులు
అందరిముందు బహిరంగంగా రోడ్డుపై జరుగుతోంది హత్య
ఆపరే ఏ ఒక్కరు
భావి భారత పసిపౌరుల ఊచకోతను
తెప్ప తెప్పలుగ కప్పివేసే దుష్టమోతను –

అయిపోయాయి.

"మమతా!...." మెల్లగా అంది కల్పన.

"ఏవిఁటీ?" అన్నట్టు చూసింది మమత.

"నేనెళ్ళే ముందు నీకో కానుక ఇవ్వాలను కుంటున్నాను!"

"కానుకా? ఏమిటి?"

"కాంచన సౌధం!"

"కాంచన సౌధమా?" కళ్ళు చిట్లించింది మమత.

"అవును!.... ఆ సౌధంలో నా కిష్టమైన వ్యక్తి రూపాన్ని దాచుకున్నాను. ఇంక ఆ సౌధం నాది కాదు!.... నీ దగ్గరుండడమే న్యాయం!...." అంటూ తన మెడలోని లాకెట్ గొలుసు తీసి మమత మెళ్ళో వేసింది కల్పన.

ఆమె చేతులు ఒణికి పోయాయి.

ఆ చేతుల్ని పట్టుకుని బావురుమంది మమత.

"ఛ!..ఛ!.. ఏమిటిది?.... నీ వస్తువు నీ కిచ్చానంతే!" తేలిగ్గా అంది కల్పన.

"కల్పనా!.. ." గంభీరంగా పిల్చింది మమత కళ్ళు తుడుచుకుంటూ

"ఏవిఁటీ?...."

లాకెట్ చేతో పట్టుకుని –

"ఈ కాంచన సౌధంలోని రూపాన్ని నా కిచ్చేశావ్!.... కానీ... అలాగే నీ హృదయ సౌధంలోంచి కూడా ఆ రూపాన్ని తుడిచేస్తానని మాటివ్వు!"

పక్కున నవ్వింది కల్పన.

"ఈ మాట నీకు నవ్వొచ్చేలా వుందా?" ఆశ్చర్యంగా చూసింది మమత.

"లేకపోతే ఏవిఁటి మమతా!... ఆ రూపాన్ని నా మనసులోంచి తుడిచెయ్యక పోతే.... ఈ లాకెట్.. . నీ కెందు కిస్తాను!" మళ్ళీ నవ్వింది కల్పన

"నిజంగానే... బావని ... మర్చి పోతావా?"

"ఆఁ!...."

"స్నేహితుడుగా కూడా మర్చిపోతావా?" పాలిపోయిన మొహంతో అన్నాడు విశ్వం.

"ఛ! అలా ఎందుకు మర్చిపోతాను!"

"అంటే. .పెళ్ళి చేసుకుంటావన్న మాటేగా?" ఆశగా అడిగాడు రాయుడు.

తృళ్ళిపడిన కల్పన వెంటనే తేరుకుని –

"తప్పకుండా చేసుకుంటాన్నాన్నా!.... కానీ ... కొన్నాళ్ళు నాకు టైమివ్వండి!" గంభీరంగా అంది.

"అమ్మాయిగోరూ!.... నిజంగానే.... పెళ్ళి సేసేసుకుంటారుగా?" మంగి అడిగింది.

"నిజం మంగీ!. .. చేసుకుంటాను. నాకు నచ్చిన వాడు, నన్ను మెచ్చిన వాడు.... తటస్థపడితే. .. తప్పకుండా చేసుకుంటాను!"

మంగి, రాయుడు తృప్తిగా చూశారు.

మమతకి ఎందుకో. .. కల్పన మాటలు నమ్మ బుద్ధి కాలేదు అలా చూస్తుండి పోయింది.

"విష్‌యు బెస్టాఫ్‌లక్!" గొణిగాడు విశ్వం.

"థాంక్యూ!" మధురంగా నవ్వింది కల్పన.

ఆమె కళ్ళల్లో కనిపించని అగాధాలు!

మమతకి మనసు కాస్త తేలికైంది.

"సరే కల్పనా!. .. నీ హృదయ సౌధంలో ప్రతిష్ఠించే.. ఆ దైవం. .. అతి త్వరలో ప్రత్యక్ష మవ్వాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను." కళ్ళు తుడుచుకుంటూ అంది.

అంతా వెళ్ళిపోయాక తన గదిలో మంచాని కడ్డంపడి భోరుమంది కల్పన

"విశ్వం! వాళ్ళ తృప్తికోసం అందంగా అబద్ధం ఆడానే గానీ ... నిజంగా నీ రూపాన్ని చెరిపెయ్య గలనా నాలోంచి? కాలమే కాదు.... ఆ దేవుడు కూడా మాన్పలేడు నా గాయాన్ని! ఒక్క చావు మాత్రమే ... చెయ్యగలదా పని!' అని ఆక్రోశించింది.

* * * *

ట్రైన్ బయల్దేరడానికి సిద్ధంగా వుంది.

అందరి మనసులూ భారంగా ఉన్నాయి. దాదాపు ఊరు ఊరంతా తరలి వచ్చింది కల్పనకి వీడ్కోలు చెప్పడానికి.

"తొందరగా వచ్చెయ్యండమ్మగోరూ!" ఏడుస్తూనే అంది మంగి. వీరడు బాధగా చేతులు జోడించాడు.

"అయామ్ సారీ!" గొణిగినట్టు అన్నాడు విశ్వం.

"సారీనా? ఎందుకు?"

"దీని కంతటికీ కారణం నేను.... నా మూలంగానే నీ జీవితం...."

"ఛ! భలేవాడివి విశ్వం!.... నువ్వెప్పుడైనా నాతో ప్రేమించినట్టు చెప్పావా?.... నేనే ఏదో వూహించుకుంటే అది నీ తప్పా?.... అయినా ఇప్పు. డేమైంది?.... నేను త్వరలో వచ్చి మీ అందరి కోరిక ననుసరించి పెళ్ళి చేసుకు తీరతాను! సరేనా?" బలవంతంగా నవ్వుతూ అంది కల్పన.

"కల్పనా! నన్ను శపించకూ!" ఏడుస్తూ అంది మమత.

"లేదు మమతా! శపించను! ఆశీర్వదిస్తున్నాను. నువ్వూ, విశ్వం.... కలకాలం హాయిగా వుండండి!.... కానీ.... నన్ను మాత్రం.... మర్చి పోకండి!.. ." అరచేతుల్లో ముఖం దాచుకుంది కల్పన.

ట్రైన్ పెద్దగా అరిచింది.

కల్పన ట్రైన్ ఎక్కింది.

గార్డ్ విజిల్ వేసి పచ్చ జెండా ఊపాడు. అందరి హృదయాలు భారంగా అయిపోయాయి.

ట్రైన్ స్టార్ట్ అయింది.

మసగ బారిన కళ్ళతో చూస్తూ చెయ్యి వూపింది కల్పన

ప్లాట్‌ఫారం మీద ఎన్నో జతల కళ్ళు తడి కళ్ళతో ఆర్తిగా చూస్తూ గాల్లోకి చేతులూపుతున్నాయి

ట్రైన్ వేగం పుంజుకుంది.

క్షణాల్లో కనుమరుగై పోయింది!

(అయిపోయింది)

# కథగాని కథ

## విశ్వశ్రీ

"శ్రీహరి సుప్రభాతం రికార్డు వింటూ
ఒంటరిగా తన గదిలో
ఎంత ఎంత ఆలోచన్లతో,
విరామ మెరుగక విసుగు చెందక
విప్లవ రచనల్నింటిని
ఏకబిగిని పఠిస్తున్నాడు
వకీలు సుబ్బారావు
మెడలో ముత్యాల హారాలు
చేతులకు రవ్వల గాజులు
అపర లక్ష్మిదేవిలా ప్రవేశించింది
సుబ్బారావు భార్య ఆదిలక్ష్మమ్మ.
పుస్తకాల్లో తలదూర్చిన సుబ్బారావు
గమనించ లేదు భార్య రాక
భర్త పరాకుకు చిరాకు చెంది
చిరుకోపంతో 'చిన్న లెక్క చెప్పండి,
కోర్టుకు రేపు సెలవే గదా!" అన్న
ఆదిలక్ష్మమ్మ మాటలకు
పరాకు తేరుకొని, చిరాకుతో నున్న
ఆదిలక్ష్మమ్మ వైపు చూసి సుబ్బారావు
"10 రూపాయలకి 10 దినాలకు
రెండు రూపాయల ప్రకారం
50 రూపాయలకు 25 దినాలకి
ఎంత వడ్డీ" అన్న లక్ష్మమ్మ ప్రశ్నకు
తడబాటులేక సమాధాన మిచ్చాడు సుబ్బారావు.
మారు మాట్లాడక వెనుదిరిగింది ఆదిలక్ష్మమ్మ.
ఇంటి ముందు పూదోటలో
మొక్కలకు నీళ్ళు పడుతున్న నీలన్న,
పక్కనే వున్న పరంధాముడు,
అక్కడకు చేరిన ఆదిలక్ష్మమ్మల,
సంభాషణను గదిలో నుండే
వింటున్నాడు సుబ్బారావు
'నీలా లెక్క ప్రకారం
35 రూపాయలు వడ్డీ
పరంధాముడు పేదవాడని
పదే పదే చెప్పాను,
మా వారితో అపుడపుడు వారికి పనుంటుంది,
కనుక కాదనలేక కనకమ్మ
25 రూ ల వడ్డీకి ఒప్పుకొంది
అసలూ, వడ్డీ కలిపి 75 రూపాయలు
కాదంటే కమ్మలు మిగి కాదంటున్నది కనకమ్మ."
అని కుండలు బద్దలు కొట్టినట్టు చెప్పింది
ఆదిలక్ష్మమ్మ
వెంటనే అందుకున్నాడు నీలడు,
"ఏరా! పరంధామా!
కష్టాల్లో వున్నాను. కార్మికులు
సమ్మె చేస్తున్నారు, కమ్మలుంచుకొని
50 రూ.లు ఇప్పించు, కూతురు కాన్పంటివి.
కడుపు తీపెరిగిన తల్లి
డబ్బులేక తల్లడిల్లి
కమ్మలుంచింది కనకమ్మ దగ్గర
పరువు గలోళ్ళను, పాతిక్కి పరక్కు
పరుల పంచకు పంపరాదు,
అసలూ వడ్డీ ఇచ్చుకో లేకుంటే
కమ్మలాస వదలుకో."
పద్దినాలు గడువడిగి పరంధాముడు
తిరుగు దారి పట్టాడు.
ఆ రోజు "మే" డే.
ఎక్కడ చూసినా కార్మికుల సందడి
సాయంత్రం ఆరు గంటలకు
సుబ్బారావు ఉపన్యాసం
పెట్టుబడిదారుల్ని – వడ్డీ వ్యాపారుల్ని
రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల్ని
తిట్టిన తిట్టు తిట్టకుండా
మూడు గంటలు ముచ్చటగా
తిట్టాడు సుబ్బారావు
అందరితో పాటు పరంధాముడు
మురిసి పోయాడు–సుబ్బారావు మాటలకి
తన ఆనందాన్ని అరచేతుల్లో చూపాడు
ఆర్ద్రతి పరంధాముని గుండెల్లో
కదిలింది తన గతం.

* * * *

కూలీ నాలీ చేసే తండ్రి
ఫ్యాక్టరీలో పనికి కుదిర్చాడు తనను,
ఫ్యాక్టరీ పనికెళ్ళిన మొదటి రోజు
తన సంతోషాని కంతే లేదు.
మొదటి నెల జీతాల రోజు
మనసు కాస్త చివుక్కు మంది
కారణం – రిజిస్టర్‌లో తాను
సంతకం చేసింది మూడు వందలకు
మేనేజరు తన చేతి కిచ్చింది
రెండు వందల యాభై, అందులో
గుమస్తాకు పాతిక
తనకు మిగిలింది రెండు వందల ఇరవై ఐదు.
అది మామూలే అన్నారు తోటి కార్మికులు.
కూలి సేసి ఐదుగుర్ని సాకినాం మేం
కార్మికుడివి నీకేం
మనువాడ మన్నారు కన్నవాళ్ళు.
కాదన్లేక పాపులమ్మకు పతి అయ్యాడు తాను
పెళ్ళికి ఫ్యాక్టరీ వాళ్ళిచ్చిన అడ్వాన్సు 1500/-
నెలకు 50/- లెక్కన తాను కట్టింది 50 నెలలు
లెక్కలు తెలిసినా
ఉద్యోగ మూడు తుందంటాడు మేనేజరు.
కాదన్లేక కన్నీళ్ళు కార్చాడు తాను.
మొదటి కాన్పుకి పాపులమ్మని
ప్రభుత్వాస్పత్రిలో చేర్చాడు
ఆ ధర్మాసుపత్రిలో ధర్మం
ఆస్పత్రి గోడలకు పునాదిరాళ్ళుగ
ఉపయోగపడిందని తెలియదు తనకు.
కాకీ బట్టలేసుకున్న వాచ్‌మాన్
కఠిన చూపులు కరగడానికి
కాసులివ్వక తప్పలేదు.
మలినం లేని తెల్లని వస్త్రాలు ధరించిన
మలిన హృదయులు నర్సమ్మలకి
వాళ్ళవాటా యిస్తేగాని బెడ్ దొరకలేదు.
కాన్పుకష్టం కావాలి ఆపరేషన్
అందుకు ఆరు వందలవుతుందన్న
డాక్టర్ మాటలకి పరువు పణంగా
తెచ్చిన మొత్తాన్ని డాక్టర్ కంకితం చేసి
ప్రాణాలతో బయటికి తెచ్చాడు
తల్లీ కూతుళ్ళని: పుత్రికోదయంతో పాటే
తనకుదయించిందో ప్రశ్న – అప్పెలా తీర్చాలని
తలచుకొన్న వెంటనే తడితడిగా మారాయి
కన్నులు
అది చూసి అన్నారు బంధువులు
కూతుర్ని చూసిన ఆనందమని.
అప్పుడు మొదలయింది రోజుకో పూట
పస్తుండడం తనకు తన యిల్లాలికి
ఆ ఒక్క పూట తిండికైన, పాపులమ్మ
పనిమనిషిగా మారక తప్పలేదు
ఎంత చేసినా ఏమిచేసినా
వడ్డీతప్ప అసలకు ఒక్క రూపాయీ జమ కాలేదు
అందుకే
ఒడిలో పిల్లను బడిలోకి పంపే సమయంలో
కలిగిన వాళ్ళ బిడ్డలకు కాపుగుంచాడు
కన్నకూతుర్ని.
ఆరోజు రాత్రి తన పక్క తడిసింది,
కన్నబిడ్డ మూత్రమను కొన్నది కన్న తల్లి
తన కన్నీళ్ళని తెలియదు పాపం పాపులమ్మకి,
పాపులమ్మ రెండో కాన్పులో,
పుత్రరత్నం పవనకుమార్ జన్మించాడు.
రెండో కాన్పుకు–ధర్మాసుపత్రిలో
చేర్పించే స్తోమత లేక,
ఆరు బయట అరుగు మీద
ఏడ్చిన ఏడ్పు ఎవ్వరికి విన్పించలేదు.

ఇంటిలోని పసిగుడ్డు ఏడ్పుకి
తలెత్తిన తన్ను చూసి
పక్కవాళ్ళు మందహాసం చేసారు,
ఆకన్నీళ్ళు ఆనంద బాష్పాలని.
పసివానికి పాలు లేవని తెలిసి,
వంశోద్ధారకుని ఉసురు నిలపడానికి,
పాలపొడి కోసం – తాను
చేయని ప్రయత్నం లేదు;
ఫలించిన ప్రయత్న మంతకన్నా లేదు.
వేణ్ణీళ్ళు, చక్కెరకు గూడ
వెతలు తప్పలేదు.
బాలింతరాలు పనిమానిందొకనెల
ఆ నెలలో వడ్డీ
అసలులో చేరింది.
నెలనెల వడ్డీ కట్టక పోతే
ఇంటిముందు అప్పుల వాళ్ళ బైఠాయింపు.
పోతుంది పరువు, అందుకే
రాత్రిపూట రిక్షాతొక్కాడు తాను.
పాపులమ్మ పని మనిషిగా, తాను
కార్మికుడు ప్లస్ రిక్షాకూలీగా
తీర్చగలిగింది వడ్డీలు మాత్రమే.
తన అప్పులు తీరలేదని
కాలమాగలేదు.
కూతురు పెళ్ళీడు కొచ్చింది.
కూతురు వివాహం
కొడుకును కూలీగా మార్చింది.
పట్టుదలతో పదక్షరాలు నేర్చుకోవలసిన
పవన్‌కుమార్
కూలి నాలి చేస్తూ
ఉడుకు రక్తం పురకలు వేస్తుంటే,
నిచ్చెన లేని ఆర్. టి. సి. బస్సులపై
లగేజీలు వేయడం లోను,
అవలీలగ మూటలు మోయడంలోను,
తనను మించిన వారు
లేదనిపించు కొన్నాడు.
ఆలికష్టం ప్లస్ తన జీతం = వడ్డీలు
కొడుకు కష్టార్జితం = గంజినీళ్ళకు.
కళ్యాణం నాడు తాను చేయించిన కమ్మలు
కూతురు కాన్పు నాటికి చేరాయి
ఆదిలక్ష్మమ్మ (కనకమ్మ) చేతికి.
అవి కావాలంటే కట్టాలి 75 రూపాయలు
కాదంటే పోతాయి కమ్మలు.
పరంధాముడిట్లా పరిపరి విధాల
చింతిస్తుంటే.....;

★ ★ ★ ★ ★

ఆరాత్రి అక్కడ సుబ్బారావింట్లో....
వేదిక మీద వేసిన పూలమాలలు,
కార్మికులిచ్చిన కానుకల్తో పాటు,–
ఏప్రిల్ నెల్లో వచ్చిన వడ్డీ
సరిచూస్తున్నారు సుబ్బారావూ ఆదిలక్ష్మమ్మ.
మాటల్లో మాటగా అన్నాడు సుబ్బారావు
"పరంధాముడు అసలు వడ్డీ యిచ్చాడా?



## బాంబినో వడ

1 ప్యాకెట్ బాంబినో
3 కప్పుల నీళ్ళు
2 కాని 3 కాని బ్రెడ్‌ముక్కలు నీళ్ళలో నానబెట్టి ముద్దగా చెయ్యాలి
2–3 ఆలుగడ్డలు
25 గ్రా వేయించిన పల్లీలు
4–5 తరిగిన పచ్చిమిరపకాయ ముక్కలు
200 గ్రా. నూనె వడలు వేయించడానికి
1 కొత్తిమీరి కట్ట

మరుగుతున్న నీళ్ళలో కాస్త ఉప్పు బాంబినోలో వేయాలి. ఉడికిన తర్వాత తడిలేకుండా వేరే ఉంచాలి. బ్రెడ్ ముద్దను ఉడికించిన ఆలుగడ్డలను కలిపి ముద్ద చెయ్యాలి. దీనికి బాంబినో ముద్దను పల్లీలతో, మిరపకాయలు, కొత్తిమీరితో కలపాలి. నీరు లేకుండా బాగా ముద్దగా చెయ్యాలి. చేతితో కాని ఆకులో గాని ఆ ముద్దను వడలలాగ గుండ్రంగా ఒత్తి నూనె మరుగుతున్న మూకుడులో వెయ్యాలి.

రుచి కోసం సాస్ లేదా కొబ్బరి కాయ చట్నీ నంచుకుంటే భలే బాగుంటాయి.



నేనిట్లా తిట్టక తప్పదు.
అదిసరేగాని మంగళవారం
మనమ్మాయి కుసుమకు రిజిస్ట్రారాఫీసులో
వివాహం మరువలేదుగదా?"
"మరువలేదు గాని – ఒక్కగా నొక్క కూతురికి
ఘనంగాపెళ్ళి చేయక యిదేమిటి
రిజిస్టర్ పెళ్ళి? అయినా యిందుకు
మగపెళ్ళి వారెట్లా ఒప్పుకున్నారు?"
నిలదీసింది ఆదిలక్ష్మమ్మ.

"పిచ్చిదానా! పెళ్ళి ఖర్చు దండగ
రిజిస్టరు పెళ్ళి పొదుపుకు పొదుపు
పేరుకు పేరు తెచ్చిపెడ్తుంది.
వాళ్ళూ 'మనకులం – మన గోత్రం వాళ్ళే
అందుకే రిజిస్టర్ పెళ్ళికి ఒప్పుకొన్నారు
అన్న సుబ్బారావు మాటలకి
మతి పోయి ఆదిలక్ష్మమ్మ
"మనకులం" వాళ్ళని తెలుసు
"మన గోత్రం" వాళ్ళంటారేంటి
"సరి గోత్రం" చేయరాదు గదా?"
అని వెర్రిమొహం పెట్టింది.
"వెర్రిదానా...... నేననేది
ఆకులం ఆ గోత్రం కాదు –
నేను నిజమైన సమతా వాదిని
నాకు కుల గోత్రాల్లేవు.
"మనకులం" అంటే మనలాగే
పేరుకు కమ్యూనిష్టులని
"మన గోత్రం" అంటే మనలాగే
రహస్య వడ్డీ వ్యాపారస్తులని".
తెలిసిందా అన్నాడు సుబ్బారావు.

ఏమైనా ఎగనామం బెట్టాడా?" –
"పది రోజులు గడువడిగాడు
ఆ పదిరోజుల వడ్డీకి నామం పెడ్తాడేమో".
అని అనుమానం వ్యక్తం చేసింది
ఆదిలక్ష్మమ్మ.
"అందుకే 25 రూపాయల వడ్డీని
ముందే 35 రూ.లు చేసావు నీవు"
అని భార్య తెలివిని మెచ్చుకున్నాడు
సుబ్బారావు.
అలకగా ఆదిలక్ష్మమ్మ "అయినా
ఉపన్యాసమంటే

## కథగాని కథ

వడ్డీ వ్యాపారులను తిట్టడమేనా"
అని సూటిగ ప్రశ్నించింది.
వెంటనే అందుకున్నాడు సుబ్బారావు
"తిట్టక పోతే మనకథ బయట పడుతుంది
కనకమ్మ ప్లస్ మనం ఆడేది నాటకమని.
నిన్ను కనకమ్మ – కనకమ్మను నీవు
నిందించు కోవడం బూటకమని.
లోకానికి తెలియ గూడ దనుకుంటే

* * * * *

యజమానుల సంభాషణంతా వరండాలో
మసక నిద్రలో నే విన్నాడు నీలన్న
'పెద్దోల్ల కులగోత్రాలేరి కెరుక'
అనుకున్నాడు మనసులో
అంతకన్నా తానేమి చేస్తాడు గనుక. □




*Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor: S. Radhakrishna.*
Editoriel : 75667 Phones :- Business : 61247, 61248,

## సినిమా

40 వ పేజీ తరువాయి

### "శ్రీ షిర్డీ సాయిబాబా మహాత్మ్యం"

భాటే (వీరభద్రరావు) దగ్గరికి ఆయన అనుచరులు ఆయారాం, గయరాం వచ్చి, "సాయిబాభా చదువు ఇచ్చాడు. నీళ్ళు ఇచ్చాడు. కాళ్ళు ఇచ్చాడు. కళ్ళు ఇచ్చాడు. అది ఇచ్చాడు, ఇది ఇచ్చాడు- అని ఎక్కడ చూసినా, విన్నా.... సాయిబాబా.... సాయిబాబా.... సాయిబాబా!" అని ఏకరువు పెట్టారు.

ఇంతవరకు "ఈ చరిత్ర ఏ సిరాతో" అనే ఆఫ్‌బీట్ చిత్రం, "పల్నాటి పులి" అనే మసాలా చిత్రం, "ఖూనీ" అనే క్రయిమ్ చిత్రం నిర్మించిన సాయిచక్ర ప్రొడక్షన్స్ అధినేత గోగినేని ప్రసాద్ లక్షలు సంపాదించాలనే లక్ష్యంతో కాక ఏ మతమైనా సమ్మతమే అంటూ సర్వమానవ సౌభాతృత్వాన్ని కాంక్షిస్తూ, మానవ రూపంలో అవతరించిన దైవ స్వరూపం శ్రీ సాయిబాబా చరిత్రను ఆయన భక్తుడుగా తెరకెక్కించాలనే చిరకాల సంకల్పాన్ని నెరవేర్చుకున్న "శ్రీ షిర్డీ సాయిబాబా మహాత్మ్యం" చిత్రం డిసెంబర్ 26న దత్తజయంతి పర్వదిన కానుకగా సాయిబాబా భక్తులనంతా పారవశ్యంలో ముంచబోతోంది. విజయచందర్ మన ముందు సాక్షాత్కరింప జేసే ఈ మహనీయుని చిత్రంలో ఇతర పాత్రలకు ప్రాణప్రతిష్ఠ చేయడం తమ పూర్వజన్మ సకృతంగా భావించిన వారు చంద్రమోహన్, జె.వి. సోమయాజులు, శరత్‌బాబు, కాంతారావు, రాజా, వీరభద్రరావు, త్యాగరాజు, రామకృష్ణ, కాంచన, అంజలీదేవి, నిర్మల, రమాప్రభ. ఇదొక భగవత్ప్రేరణగా భావించి, నిష్ఠతో పరమ పవిత్రంగా కృషి చేసిన డైరెక్టర్ కె. వాసు, సంభాషణల కర్త మధు, గీత రచయితలు ఆచార్య ఆత్రేయ- విద్వాన్ కోట సత్య రంగయ్యశాస్త్రి, ఎం.ఎ., సంగీత దర్శకుడు ఇళయరాజా, ఛాయాగ్రాహకుడు జయరాం, శిల్పి బి.ఎన్. కృష్ణ, సంకలనకర్త నాయని మహేశ్వరరావు, నిర్మాణ సారధి కె. బాబూరావు మున్నగు వారందరూ సాయిబాబా భక్తులవడం ప్రత్యేకంగా పేర్కొనవలసిన అంశం.

### మోహన్‌బాబు "అయ్యప్ప స్వామి"గా దుర్గా దర్శకత్వంలో దాసరి చిత్రం

"కొండముది శ్రీరామచంద్రమూర్తి స్క్రిప్ట్ రాస్తున్నారు. ఫిబ్రవరి నుంచి షూటింగ్," అన్నారు దాసరి నారాయణరావు. ఈయన నిర్మించే తారకప్రభు ఫిలిమ్స్ "అయ్యప్పస్వామి మహాత్మ్యం" చిత్రంలో మోహన్‌బాబు ప్రధాన పాత్రధారి. రమేష్ నాయుడు సంగీతం, దుర్గా నాగేశ్వరరావు దర్శకత్వంతో దాసరి పద్మ సమర్పిస్తారి చిత్రాన్ని. □

# హైదరాబాదు నోట్‌బుక్

## హిందీ భాషా సాహిత్యాలకు తెలుగువారి సేవ:-

కేంద్రియ హిందీ నిదేశాలయ రజతోత్సవం సందర్భంగా ఈ సంవత్సరం గోష్ఠులు, నవహింది రచయితల కోసం శిబిరాలు నిర్వహిస్తున్నారు. దానిలో భాగంగా ఉస్మానియా విశ్వవిద్యాలయం హిందీ శాఖ సహకారంతో యూనివర్సిటీ ఆర్ట్సు కాలేజీలో నవంబరు 24వ తేదీ నుంచి నాలుగు రోజులపాటు భారతీయ భాషలలో నిఘంటు నిర్మాణం - సాధక బాధకాలు, హిందీ భాషా సాహిత్యాలకు తెలుగువారి సేవ అనే విషయాలపై సదస్సు జరిగింది. ఆరు విభాగాలుగా జరిగిన ఈ సదస్సులో హిందిలో పెక్కు నిఘంటువులు సిద్ధపరచిన డాక్టర్ హరదేవ్‌బాహరి, ప్రముఖ హిందీ సాహిత్య విమర్శకులు ఆచార్య నాగేంద్ర పాల్గొనడం ఈ సదస్సు ప్రాముఖ్యాన్ని యినుమడింపజేసింది. హిందీలో నిఘంటువులు, నిఘంటు నిర్మాణంలో ముఖ్యంగా ఆరోపాలు (ఎంట్రీస్), వాటి అర్థాలు, ఉచ్చారణ, వ్యాకరణ విశేషాలను గురించి డాక్టర్ హరదేవ్‌బాహరి, డాక్టర్ త్రిభువననాధ్ శుక్ల ప్రసంగించారు. డాక్టర్ వి. ఆర్. జగన్నాధన్(తమిళ్), డాక్టర్ చంద్రశేఖర్ (పంజాబీ), డాక్టర్ మోహన్‌లాల్‌సర్ (కాశ్మీర్), ఆచార్య పి. సుందరం (తమిళ్), శ్రీ నంబూద్రి (మలయాళం), డాక్టర్. జగన్నాధ్ కుల్‌కర్ణి (హిందీ), డాక్టర్ రవ్వా శ్రీహరి (సంస్కృతం), డాక్టర్ శశిముదిరాజ్, డాక్టర్ కట్టున్‌పిళ్లే, డాక్టర్ పి. విద్యాసాగర్, డాక్టర్ ముకురాల రామారెడ్డి మున్నగువారు ప్రామాణికమైన పరిశోధన వ్యాసాలు చదివారు. హిందీ భాషా సాహిత్యాలకు తెలుగువారి సేవను గురించి ఆచార్య సుందరరెడ్డి, ఆచార్య భీమసేన్‌నిర్మల్, ఆచార్య ఎస్. టి. నరసింహాచారి మున్నగువారు ప్రసంగించారు. సమాప్త్యుత్సవంలో ఆచార్య భీమ్‌సేన్ నిర్మల్ రససిద్ధాంతమనే బృహద్గ్రంథాన్ని ఆచార్య నాగేంద్రకు సమర్పించారు. ఈ గ్రంథాన్ని ఆచార్య నాగేంద్ర రచించారు. ఆచార్య భీమసేన్ నిర్మల్ దీనిని ఆంధ్రీకరించగా, తెలుగు అకాడెమి ప్రచురించింది. ఈ సమావేశంలో ఉస్మానియా విశ్వవిద్యాలయం రిజిస్ట్రారు ఆచార్య బి. హనుమంతరావు పాల్గొన్నారు. కేంద్రియ హిందీ నిదేశనాలయం (సెంట్రల్ హిందీ డైరెక్టరేట్) పక్షాన సదస్సు ప్రారంభంలో శ్రీ రాజమణి తివారి స్వాగతం చెప్పారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం డీగ్ ఆచార్య సత్యనారాయణ సింగ్ ప్రారంభోత్సవం జరిపారు. ఈ సదస్సు సందర్భంలో ఏర్పాటుచేసిన పుస్తక ప్రదర్శనానికి మరాఠ్వాడా విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ ప్రారంభోత్సవం చేశారు. ద్విభాషా త్రిభాషా నిఘంటువులే కాక పారిభాషికపకోశాలు గూడ ప్రేక్షకులను ఆకట్టుకొన్నాయి. ఈ సదస్సును ఉస్మానియా విశ్వవిద్యాలయం హిందీ శాఖాధ్యక్షులు డాక్టర్ ఆచార్య భీమ్‌సేన్ నిర్మల్ సమర్థంగా నిర్వహించారు. (డాక్టర్ నిర్మల్ హైదరాబాద్ నోట్ బుక్ ద్వారా పాఠకులకు ఇదివరకే పరిచితులు.)

## కళాసేవ నాటిక:-

తెలుగు విజ్ఞాన పీఠం నట శిక్షణ విభాగం విద్యార్థులు నవంబరు 25న రవీంద్రభారతి మినీ థియేటర్‌లో తొలిసారిగా ప్రదర్శించిన కళాసేవ నాటిక విజ్ఞాన పీఠానికి, నట శిక్షణ విభాగానికి గొప్ప యశస్సును కలిగించింది. విద్యార్థులు ప్రథమ ప్రయత్నంలో ఇంత గొప్పగా నటించి, నట శిక్షణ విభాగం ప్రధానాచార్యులు శ్రీ దేవరకొండ బాలగంగాధరతిలక్‌కు, ప్రత్యేకాధికారి డాక్టర్ తూమాటి దోణప్పకు, శిక్షణ తరగతుల పరిశీలకులు శ్రీ రామచంద్రరావుకు గర్వకారణమని భావిస్తున్నాను. ఈ నాటికను శ్రీ దేవరకొండ బాలగంగాధరతిలక్ రచించారు. దీనిలో పాల్గొన్న విద్యార్థులు శ్రీయుతులు వినయకుమార్, సురేంద్రనాధ్, జి. రామచంద్రరావు, నవీన్‌రెడ్డి, దుర్గాప్రసాద్, లక్ష్మినారాయణ, మునిమాణిక్యం రామచంద్ర, శ్రీమతి హేమా కిరణ్‌కుమారి - చక్కగా నటించారు. చివరన దుర్యోధన ఏకపాత్రాభినయం శ్రీధరరాజు, గయోపాఖ్యానంలోని కృష్ణ ఏకపాత్రాభినయం రమేష్ చక్కగా నిర్వహించి పూర్వ విఖ్యాత నటుల కోవను మున్ముందు అందుకోగలరని అనిపించారు. నాటిక ప్రారంభంలో నట శిక్షణ విభాగం కోఆర్డినేటర్ కుమారి ఉషాజయంతి విద్యార్థులను ప్రేక్షకులకు పరిచయం చేశారు. చివరన తెలుగు విజ్ఞానపీఠం ప్రత్యేకాధికారి డాక్టర్ తూమాటి దోణప్ప ప్రదర్శనానంతరం ప్రసంగిస్తూ నట శిక్షణ విభాగం విద్యార్థులను, నిర్వాహకులను అభినందించారు. కళాకారులను తయారుచేసి, కళలను అభివృద్ధిపరచడం విజ్ఞానపీఠం ముఖ్యోద్దేశమని, అందువల్లనే ఈ శిక్షణ విభాగం ఏర్పాటుచేశామని, మున్ముందు దీనిని అభివృద్ధి పరచడానికి ప్రభుత్వ సహాయాన్ని అర్థిస్తున్నామని ఆయన అన్నారు. కళాసేవ నాటికలో నటించిన వారిని చూసిన తర్వాత ఈ విభాగం గొప్ప అభివృద్ధిని సాధించి, మహానటులను రూపొందించగలదనే విశ్వాసం తమకు కలిగిందని ఆయన అన్నారు. తర్వాత శ్రీ డి. బి. జి. తిలక్ మాట్లాడుతూ కళాసేవ నాటిక రచనను గురించి వివరించారు. కళాసేవను గురించి విద్యార్థులు, విద్యార్థినులు పరస్పరం జరిపిన సంభాషణనే నాటికగా రూపొందించానని అన్నారు. నట శిక్షణ విభాగం ప్రధానాచార్యులైన శ్రీ తిలక్‌ను గురించి రెండు మాటలు చెప్పాలి. శ్రీ తిలక్ నటరాజశేఖర శ్రీ డి. వి. సుబ్బారావుగారి కుమారులు. 1924 జులై 31న జన్మించారు. బి. ఎ. చదివారు. తండ్రిగారి ఆస్థి అయిన నటనను స్వాయత్తం చేసుకొన్నారు. తండ్రి గారితోపాటు పెక్కు నాటకాలలో నటించి మెప్పు పొందారు. ఇండియన్ డ్రెమెటిక్ కంపెనీ అమెచ్యూర్స్ అనే నాటక ప్రదర్శన

ఇటీవల మదరాసులోని ప్రముఖ సాంస్కృతిక సంస్థ "కళాసాగర్" ఏర్పాటు చేసిన నాటికల ప్రదర్శనలో తెలుగు కళాసమితి హెచ్. ఏ. ఎల్. హైదరాబాదు వారిచే ప్రదర్శింపబడిన శ్రీ డి. వి. రమణమూర్తి హాస్య నాటిక "వశీకరణం" లో శ్రీమతి కె. శకుంతల, శ్రీ బి. ఎ. చౌదరి, శ్రీ వై. ఎ. ఆర్. ఆచార్యులు, శ్రీ ఎం. ఎ. రంగారావు.



## హైదరాబాద్ నోట్‌బుక్

సంస్థను కొన్నేళ్లపాటు నిర్వహించారు.

1948లో వాహినీ స్టుడియోస్‌లో చేరి చలనచిత్ర దర్శకత్వంలో శిక్షణపొంది గుణసుందరి కథ, పాతాళభైరవి, పెళ్లి చేసి చూడు, పెద్ద మనుష్యులు, దొంగరాముడు, భక్త రామదాసు, ఉషా పరిణయం మున్నగు పెక్కు సినిమాలలో అసిస్టెంట్ డైరెక్టర్‌గా పనిచేశారు. మనసిచ్చిన మొగుడు, దేవుని వరం మున్నగు చిత్రాలకు దర్శకులయ్యారు. కొన్ని చిత్రాలలో నటించారు. సౌత్ ఇండియన్ ఫిలిం డైరెక్టర్స్ అసోసియేషన్ నుంచి చలనచిత్ర దర్శకులుగా గుర్తింపు పొందారు. 1966 వరకు చలనచిత్రరంగంలో వుండి, మరల రంగస్థల పునరుద్ధరణకు పూనుకొని, పురాణ నాటకాలను ప్రదర్శించారు, వివిధ పాత్రలు నిర్వహించారు.

1970లో గుంటూరులో వీరబాహు పాత్రకు బహుమానం పొందారు. మద్రాసు, హైదరాబాదు ఆకాశవాణి నాటకాలలో పాల్గొన్నారు. ఆంధ్ర నాటక కళాపరిషత్తు నాటకాలలో పాల్గొన్నారు. పెక్కు నాటకాలకున్యాయ నిర్ణేతగా వ్యవహరించారు. భగవద్గీతను అమరవాణి అనే పేరుతో నాటకీకరించారు. దానిని తిరుమల తిరుపతి దేవస్థానం వారు ప్రచురించారు. 1984లో ఆంధ్రప్రదేశ్ రిపార్టరీలో చేరి కణ్వ, ధర్మరాజు, భీష్మ, న్యాయాధీశ మున్నగు పాత్రలు అభినయించారు. అరవై ఏళ్ళు నిండినా జీరవోని కంఠంతో, అన్ని రాగాలలోను చక్కగా పాడగలరు, భావయుక్తంగా పద్యం చదువగలరు. పౌరాణిక, సాంఘిక, చారిత్రక నాటకాలలో గొప్పగా అభినయించగలరు. నటన, గాన, దర్శకత్వాలలో అపారానుభవం పొందిన శ్రీ తిలక్ ప్రధానాచార్యత్వం ఈ నట శిక్షణ విభాగానికి గొప్ప ఆస్తి, మూలధనం కాగలదని విశ్వసిస్తున్నాను.

**ఉపశ్రుతి:-**

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు గారు జెయిలు నుంచి వచ్చాక అస్వస్థతగా ఉన్నారని తెలిసి ఒక కాంగ్రెస్‌వాది కుశల ప్రశ్న చేయడానికి వెళ్లి "అయ్యా మీ ఆరోగ్యం ఎలా వుంది?" అని అడిగారట. శ్రీ పంతులుగారికి ఎప్పుడూ అనారోగ్యమే. కనుక ఆయన ఆ ప్రశ్నకు చీకాకుపడి, "ఏమిటా ప్రశ్న? నా అనారోగ్యం ఎలా వుందని అడగరేం?" అని ఎదురు ప్రశ్న వేశారట తపీమని.

–తిరుమల రామచంద్ర

